# విషయసూచిక

కీ॥ శే॥ నిడదవోలు భారతీ జగ్గారావు



---

# కీ॥ శే॥ నిడదవోలు భారతీ జగ్గారావు



## మనలను గురించిన ఆమె కడపటి తలంపులు

భారతి యింక మనకులేదు. వైవాహిక జీవితాన్ని రెండు మాసాలయినా గడపనీయకుండా, అగ్నిదేవుడామెను తన భర్త నుంచీ, యీ లోకంనుంచీ వేరుచేసేడు. పూనాలో తన భర్త గృహంలో యీ విషాద సంఘటన జరిగింది.

యించుమించు యిది అక్కడ జరిగిన సమయానికే 4–2–'61 తేదీన ఆమె వ్రాసిన వుత్తరం మహిళాసభకు చేరింది! విధి విలాసం మనలను గురించిన ఆమె తలంపులను వ్యక్తంచేస్తూన్న ఆ వుత్తరాన్ని యథాతథంగా యిక్కడ ప్రచురిస్తున్నాం.

మహిళాసభకు సంబంధించిన అన్ని కార్యక్రమాల్లోనూ అతి ఉత్సాహంగా పాల్గొంటూ, మన అందరితోనూ ఆప్యాయంగా, కలిసి మెలసి తిరుగుతూ. మొన్నటిదాకా మన మధ్యనే మసలిన భారతిని తలుచుకుంటే "ఆమె చనిపోయిందా!" అని మనకే ఆశ్చర్యం కలుగుతుంది.

మహిళాసభలోని సంగీతశాలకు వెడితే, యిప్పుడుకూడా ఆమె మృదు మధుర స్వరాలు మనకు వినిపిస్తున్నట్టే వుంటుంది!

ఆమెను ఎప్పటికీ మనం మరిచిపోలేము.

పూనా
4-1-'61

శ్రీమతి కమలాబాయి గారికి,

భారతి నమస్కరించి వ్రాయునది. నేను రోజూ వుత్తరం వ్రాద్దామని అనుకుంటూ, ఏదో మళ్ళా సమయం కుదరక వెనక్కి ఆలస్యం చేయడం అయింది. నేను ఆలస్యం చేసినందుకు క్షమించాలి. ఏమీ అనుకోవద్దు.

నా పెళ్ళికి మీరందరు పెద్దలువచ్చి నన్నానందించినందులకు నాకు సంతోషముగా వుంది. కానీ పెళ్ళి అవగానే నేను అందర్నీ చూసి వెడదామనుకొన్నాను. ఏమిటో చాలా తొందరయి పోయింది. వెంటనే బయలుదేరడం, నెమ్మదిగావస్తానని అనుకొన్నాను. విషయాలు అన్నీ అమ్మ చెప్పి వుంటుందనుకుంటాను.

మళ్ళా సభ కమిటీ మీటింగ్‌కి అమ్మనికలుస్తే నా సంగతులన్నీ కనుక్కొని తెలుసు కోవచ్చును. ఏమిటో అక్కడ నలుగురిలో సరదాగా తిరిగి, మీటింగులు, సభలూ, సమావేశాలు అన్నీ అలవాటయి, Sudden గా యిక్కడికి రాగానే నాకు ఏమీ తోచలేదు. పెళ్ళి అవగానే భర్త ఎక్కడవుంటే అక్కడ వుండటం భారతస్త్రీ లక్షణంకదా! ఈ మధ్య అమ్మ Poona వచ్చి 15 సర॥ వుండి వెళ్ళింది. ఏదో నా వీణ, ప్రాక్టీసు తోటి, మీరు ప్రేమతో నేర్పిన చిత్రలేఖనం తోటి, రోదాగా కాలం గడుపుతున్నాను. డ్రాయింగ్ వేస్తున్నపుడు మీరు జ్ఞాపకం వస్తారు. మీరు చెప్పినట్లు మరచిపోకుండా యింట్లోనే వేస్తున్నాను. ఈమధ్య Tagore Sketch వేశాను. అలా ప్రాక్టీసుచేస్తాను మీరు నాకు యిచ్చిన ప్రోత్సాహాన్ని నేను ఎంతో సంతోషిస్తున్నాను.

ఏమిటి మనసభ విషయాలు, క్లాసులన్నీ యథాప్రకారంగా, పరీక్షలు, మీటింగులు అన్నీ జరుగుతున్నాయనుకుంటాను. ఈ మధ్య Staff అందరూ మహాబలిపురము వెళ్ళారుటగదా! నేను సమయానికి లేనని అనుకొన్నాను. మీ అరోగ్యం బాగున్నదని తలుస్తాను.

ఇక్కడ మేం వున్న Quarters city కి చాలాదూరం అన్నమాట. చుట్టుపక్క వాళ్ళు గుజరాతి, మహారాష్ట్రం, బెంగాలీ వాళ్ళు. అలాగే వాళ్ళతో కొంచెం కొంచెం మాట్లాడుతున్నాను. అక్కడ మా Staff అందర్నీ అడిగినానని చెప్పవలెను. సావిత్రి సభకి వస్తోందనుకుంటాను. అది ఏమైనా నా సంగతులు చెబుతూ వుంటుందా? ఎప్పుడూ అది ఎక్కువ మాట్లాడదు. మనకి తెలిసిందే! బహుశా నేను April లో వస్తాను. యింకా తెలియదు. ఏదో అప్పుడు క్లాసులకి వస్తూ రాంగానే మీ బల్లదగ్గరికి వచ్చి మాట్లాడుతూ వుండడం జ్ఞాపకం వస్తూవుంటుంది. మిమ్మల్ని అందర్నీ చూడాలనివుంది. Headmistress సుశీలగార్ని అడిగినానని. వారికి నా నమస్కారములని చెప్పండి. ఆవిడకి మళ్ళా వుత్తరం వ్రాస్తాను. అత్తగారు ఏమంటున్నారు? మన తిమ్మాబాయిగార్ని అడిగానని. వారికికూడా నా నమస్కారములు తెలియచేయండి.

అత్తగార్కి నమస్కారములు. సభలో అందర్నీ అడిగానని చెప్పండి. Poona climate బాగుంది. లలితగారు చెప్పారు, అక్కడ బాగుంటుందని. చాలా బాగుందిట అని చెప్పండి. మీ వుత్తరం కోసరం ఎదురు చూస్తూవుంటాను. మీ చేత్తో వ్రాస్తే మిమ్మల్ని చూసి నట్లువుంటుంది.

అక్కడ Music Teachers ఎవరైనా వచ్చినారా? ఏమిటి? సంగతులు అవీ వ్రాయండి. యింతే సంగతులు.

ఇట్లు
**N. B. J. Rao**

---




వ్యవస్థాపకురాలు: దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 19 :: మార్చి, 1961 :: సంచిక 3

# బ్రిటిషు రాజదంపతుల ఆగమనం

పాశ్చాత్యదేశాల్లోని శక్తిసముపేతాలైన జాతులు ప్రాగ్దేశాలలోని దుర్బలజాతుల్ని తన యినుప పాదాలతో త్రొక్కి పట్టి సునాయాసంగా లోబరుచుకొని, వాటిని పశుసమూహంకంటే హీనంగాచూచి. వాటిప్రదేశాలను ఆక్రమించుకొన్న విషయం గతశతాబ్దాల ప్రపంచచరిత్ర పరిశీలించిన వాళ్ళకి విస్పష్టంగా కనిపిస్తుంది. అలాటిచోట్ల ఉన్న ఆదిమనివాసుల్ని వెళ్ళగొట్టి వాటిని వలసరాజ్యాలుగా పరిగణిస్తూ, తామే పాలిస్తూవచ్చారు. అమెరికాలోని రెడ్ ఇండియన్లు, ఆఫ్రికాలోని నీగ్రోలు అగతికివచ్చి తమతమ నివాస ఆవాసాలకు దూరంకావడం మనకాదర్శ ప్రాయాలుగా ఉన్నాయి. ఆస్ట్రేలియాఖండంలో ఈనాటివరకూ కూడా తెల్ల నల్ల భేదాలు పోలేదు. ఈ యిరవయ్యో శతాబ్దంలో కూడా తెల్లవారికి వర్ణవిభేదం తొలగిపోలేదంటే, వారినాగరికత చిత్తసంస్కారం ఎలాటిదో మనం సులభంగా ఊహింపగలం.

ఏకరాచరికపు నిరంకుశపాలనం ఈనాడు ఏజాతీకూడా సమ్మతింపదు. తమగడ్డపై అన్యుల అధికారాన్ని సహింపదు. మూడు నాలుగు శతాబ్దాలనాడు మూకఉమ్మడిగా ఉన్నప్రజకు ఆనాటి ఏకరాచరికాలు ఏమిచేసినా సమ్మతంగానేఉండేది. ఈనాడట్టి యేలుబడిచెల్లదని ప్రజే ఘోషిస్తున్నది. నూత్నచైతన్యంతో ప్రవర్తిస్తున్నది. జనానీకాన్ని నడుపుతున్నది. రాజకీయంగా వెనుకబడ్డ జాతులు, అటవికజాతులు, కొండజాతులుకూడా, స్వాతంత్ర్యం కోరుతున్న రోజులివి.

ఇట్టి సందర్భాల్లో సామరస్యంతో సహృదయత్వంతో మెలిగే దేశప్రజల అభ్యుదయార్థం, ఆయా దేశాధికారులు ఒండొరు లప్పుడప్పుడు కలిసికొని లోకంపోకడలను పరామర్శించుకొంటూ, లోకకల్యాణం చేకూర్చాలి. అలాటి అభిప్రాయంతోనే "నానాజాతి సమితి" స్థాపించడం జరిగింది. తదాశయంతోనే ఆయా దేశీయులు, జట్లుజట్లుగా మనభారత దేశానికి యాత్రలు చేస్తున్నారు.

ప్రకృతం కొన్నిదేశాలు సమానప్రతిపత్తులతో శాంతిభద్రతలతో సమస్తబాధ్యతలతో బ్రిటిషుమహారాజ్ఞి అయిన శ్రీ రెండవ యెలిజబెత్తురాణి యధ్యక్షతక్రింద ఒకటిఅయి పరస్పర సహకారంతో పనిచేయాల్నని తీర్మానించుకుంది. రెండవ ప్రపంచయుద్ధానంతరం ఏర్పడిన సమితి పెక్కు గడ్డుసమస్యలను తీర్చగలిగింది. ఇలాటి మైత్రితో మెలిగే దేశాలకే "కామన్‌వెల్తు" ప్రతిపత్తిగల జాతులు, లేదా దేశాలు అనేపేర్లు చెల్లుతుంది. మహారాణి ఆధిపత్యంగల కామన్వెల్తు దేశాలలో మన భారతసీమ ఒకటి.

మహారాజ్ఞి తాను 1947 న సింహాసనం అధిష్టించిన తర్వాత అలాటి కామన్‌వెల్తులో చేరిన రాజ్యాలను ఏబదింటికిపైగా పర్యటించి, ఇప్పుడు భారతసీమకు సభర్తృకంగా వచ్చింది. రెండేళ్ళనాడు ఆమెభర్త శ్రీ ఫిలిప్

(డ్యూకు ఆఫ్ ఎడింబరో) ఒక పర్యాయం వచ్చి వెళ్ళాడు. ఈ రాజదంపతులు ఢిల్లీలో కాలుపెట్టగానే, లక్షలకొలది జనం వారికి స్వాగతం ఇచ్చారు. ప్రభుత్వంకూడా ఈ నూతన అతిథుల్ని తగినరీతిని సన్మానించింది. మనదేశంలో వాళ్ళు సందర్శింప వలసినవాటినల్లా సందర్శించి సంతసించారు. గాంధిమహాత్ముని సమాధివద్దకువెళ్ళి పూలమాలతో దాన్ని అలంకరించి, తమ శ్రద్ధాంజలులు అర్పించారు, మన కళాప్రియుల నృత్యగానాలను మెచ్చుకున్నారు. కొన్నివస్తు ప్రదర్శనశాలలనుగూడ చూచారు. పౌర సభా సన్మానాన్నికూడా స్వీకరించారు. ఈ సభలో మాత్రమే రాణిగారు నోరు తెరచి, మనదేశంలో తానుకన్నవాటినిగూర్చి నాలుగుమాటలు చెప్పారు. ఆగ్రావెళ్ళి టాజ్‌మహల్ భవనాన్ని చూచారు;

అన్నిటికంటె ముఖ్యంగా పేర్కొనతగింది. ఈ రాజదంపతుల మృగయావిహారం. కావలసినంత సిబ్బంది తో శ్రీమతి రాణిగారు జయపూరు సంస్థానంలోని సేవాయి మధోపూరు మహారణ్యాలకు వెళ్ళి ఇచ్చవచ్చినట్లు వేటాడారు. శ్రీ డ్యూక్ఆఫ్ ఎడింబరోగారు క్రూరమృగాకీర్ణం అయిన ఆ గహనసీమలో మాటుపెట్టుకుని ఒక తొమ్మిదడుగుల పెద్దపులిని సంహరించారు.

వేట సప్తవ్యసనాలలో ఒకటి అని మనపెద్దలన్నారు. అయితే పూర్వంరాజులు వేటాడలేదా, అన్నప్రశ్నకు సమాధానం లేకపోలేదు. హరిశ్చంద్ర దశరథ దుష్యంతులు మృగయాలోలుపులే. మృగయా విహారంవల్ల కీళ్లూ-వున్నాయి. మేళ్ళూ వున్నాయి. మొదటియిద్దరూ కీడులకే పాత్రులయ్యారు. (హరిశ్చంద్రునికి, రాజ్యభ్రష్టత్వాదులు, దశరథునికి వృద్ధమునిదంపతుల శాపంవగైరాలు) ఇంకమూడవఆయనకు నూత్నవధూప్రాప్తి లభ్యమయింది. ఇంతకూ పురాణాలలోని రాజులెప్పుడయినా వేటకు వెడితే, అది ఆయా ప్రాంతాలలో వసించే గ్రామీణప్రజల వేడికోలువల్లనే జరుగుతూవచ్చింది. ఆకాలంలోనే అది ఒక వ్యసనంక్రింద జమకట్టబడ్డది. మహాఅరణ్య పరిసరాలలోని పల్లెల పైరకూ మేకల గొర్రెల మందలకు అక్కడి క్రూరజంతుకోటివల్ల విపరీతనష్టం కలిగేయెడల వాటిని నిరోధించే బలంగాని, చంపే ఆయుధసాధనాలుగాని, కలిగినవాళ్ళు కాని కారణంచేత అట్టి ఆలజడినుండి తమ గ్రామాలను రక్షించేనిమిత్తం ప్రభువుల్ని జనాంగం ప్రార్థించేవాళ్ళు. భూనేతలున్ను ప్రజానురంజకత్వం, తత్రాపి, కృషికుల విషయంలో అమితాదరంచూపేవాళ్ళు. కనుక వాళ్ళ వేడికోలును మన్నిస్తూ వచ్చారు. ఇప్పుడు అలాటి మృగయ ఒక విలాసంగా. ఒక విహారక్రీడగా, ఒక విడవలేని లాంపట్యంగా తయారయింది. బ్రిటిషువారి పాలనలో గవర్నర్లు, గవర్నరు జనరల్లు- సంస్థానాలు చూడవెళ్ళినప్పుడు, వాటి సమీపంలో మహారణ్యాలు ఏవయినావుంటే, వాటిలో వేటాడటానికి ముందుగానే వారి కార్య క్రమాలలో అలాటివి ప్రధానవిషయాలుగా చేర్చేవారు. ఇప్పుడు మనకు స్వాతంత్ర్యం వచ్చినతరువాత బొత్తిగా అట్టివాటికి ఏమాత్రం అస్కారంలేదు. కేవలం వినోదంకొరకని అందామా? హింసాపూర్వక వినోదం వినోదంకాదని ఆర్యులమతం. ప్రపంచంలోని మతాలన్నీ హింసాపూరితమగు క్రీడలను దేనైనా సరే సమ్మతించదు. ఈ విషయంలో భారతదేశం అనవసరమయిన జీవహింసను కచ్చితంగా ఖండిస్తుంది. బుద్ధుడు మహావీరుడు. అశోకుడు మున్నగువారు పుట్టిన యీ పవిత్రసీమలో హింసకు తావులేదు, ఫ్రాన్సిస్ ఆఫ్‌మిసిసిపి జీవరాసుల యందెప్పుడును దయచూపాల్నని, తనయనుభవాన్నిబట్టి రుజువుచేసినాడు. "అహింసా పరమోధర్మ" అను మహర్షుల వచన ప్రమాణములు అక్షరశః పాటించు ఆర్యభూమిలో మృగయా విహారము సర్వథా గర్హ్యం "ఆత్మవత్సర్వభూతాని" అన్న పూర్వులు ప్రాణికోట్ల కాశ్రయమిచ్చి సంరక్షించువారన్నచో వారి మార్దవ హృదయం ఎంతటి ఆర్ద్రమయినదో బోధపడగలదు.

ఎల్లప్రాణులయెడ కృపాపరుడయి వర్తించిన మనజాతిపిత అడుగుజాడలలో నడుస్తూ, ప్రకృతం ప్రభుత్వాన్ని వెలిగించే తదనుయాయులీకార్యక్రమమునకు ఎట్లుసమ్మతించిరో ఊహింప శక్యముగాకున్నది. ఈ మృగయా విహారమునుగూర్చి ప్రఖ్యాతిగన్న బ్రిటిషుపత్రికలెల్ల అనేక విధాల ఈసడించినాయి. రాజదంపతుల యీ దుశ్చర్యను తూర్పారబట్టినాయి. అంతతోబోక పులిమీదపుట్ర అన్నట్లు ఉదయపుర సంస్థానమును సందర్శించు సందర్భములో శ్రీ డ్యూకు ఆఫ్ఎడింబరో, మహారాణి దాని యేలికచే సత్కారాలంది ఆ మహారాజుయొక్క దివ్యసుందర భవనమయిన (దీవిమేడ) అక్కడి నదీద్వీపమందిరానికి పడవలో వెడుతూ ఒక మొసలినిగూడ కాల్చినట్లు వార్త. "సీలాటవనాట" జీవుల రెంటిని వేటాడటంలో శ్రీ ఫిలిప్ ప్రభువు సిద్ధహస్తుడని తోచేటట్లు ప్రవర్తించాడు.

ఇంతకూ వీళ్లు రాజకీయంగా పాల్గొని ఇక్కడి ప్రజా ప్రభుత్వముయొక్క బాగోగులను తెలిసికొందమని అందులకు తమ ప్రభుత్వోన్నతోద్యోగులున్నారను దిలాసాతో ఉండటం కొంతవరకు అందరికి ఆశాభంగాన్ని చేకూర్చిందనటంలో పొరపాటేమీలేదు.

ముఖ్యంగా తమ సార్వభౌమత్వంక్రింద రెండు శతాబ్దాలున్న ఖండంవంటి యీ విశాలదేశంమీది అధిపత్యం వదలిపోయినా, కామన్వెల్తు రాజ్యాల పరస్పర సంబంధాలుకూడా వదలిపోగలవా? కనుక తదనుగుణంగా రాజదంపతు లికమీదనయినా తమ పర్యటనలో కామన్వెల్తు దేశాల అభ్యుదయాలను దృష్టిలో పెట్టుకొని లోకక్షేమకరకార్యాలను సుహృద్భావంతో సమకూర్చి శాశ్వతకీర్తికి పాత్రులు కావల్నని మా ఆశయం. దాన్ని నిలబెట్టుకొనే భారం వారిది. నెరవేర్చే సంకల్పం సర్వోన్నతుడగు భగవంతునిది.

---

నూతన విద్యావిధానము :

## పిల్లలు స్వేచ్ఛగా అల్లరిచేయాలి

మన పిల్లలలో నూటికి 58 గురు వరకూ వారిదేహాలు ఆరోగ్యకరమైన పద్ధతులలో పెరగక పోవడంచేత తాత్కాలికంగాగాని, శాశ్వతంగాగాని, అనారోగ్యానికి గురి అయే ప్రమాదంవుందని జర్మనీలోని శిశువైద్య నిపుణులు వివరించారు.

పిల్లలు అనారోగ్యంగా పెరగడానికి జర్మన్ డాక్టర్లు రెండుకారణాలు చెబుతున్నారు. దినదిన ప్రవర్ధమానంగా ఎదిగే దేహాలకి కావల్సినంత కసరత్తు, చలనం, వ్యాయామం, లేకపోవడం రెండవది. వారి వయస్సుకి తగనటువంటి ముది అభిప్రాయాలు, లైంగికభావాలు, అలవాట్లు, అధ్యాత్మిక, సాంఘికభావాలు ఏర్పడడం,

నాగరిక దేశాలన్నింటిలోనూ పిల్లలు ఈ రెండు పరిణామాలకి గురి అవుతున్నారని వారి అభిప్రాయం. ఇటువంటి దుష్టఫలితాలకి పిల్లలు గురికాకుండా సరియైన సవ్యమైన మార్గాలలో వారికి విద్యగరపడానికి జర్మనీలో 'కీల్' రేవుకి ఆగ్నేయంగావున్న 'ప్లాన్' నగరంలో ఒక కొత్త విద్యాసంస్థ ఏర్పాటుచేశారు. ఆనగరం పరిసరాలలో వున్న సరస్సుచుట్టూఉన్న అటవీప్రాంతాలలో పిల్లలుపరుగులెత్తి గంతులువేయడానికీ, అల్లరిచేయడానికీ వారికి గంటలకొద్దీ అవకాశాలు కల్గచేయడం, వారిప్రథమ ఆశయం. ఆ ప్రాంతాలలో దొరికే పళ్లు ఫలాలు కోసుకురావడం గుహలు, అడ్డుకట్టలుకట్టడం, కాల్వలు గోతులు తవ్వడం మొదలయిన పనులు చేయడానికి వారికి బాహాటంగా వీలుంటుంది, అంతేకాదు. చిన్నతనంలో పిల్లలుకనేకలలు ఆనందించే భావాలు పూర్తిగా తమ సాయశక్తుల కొద్దీ వారు నిర్వహించడానికి వీలు కల్గచేస్తారు.

ఈ సంస్థ నిర్వహిస్తున్న శిశువైద్య నిపుణులు డాక్టరు "కొయిట్స్‌ఛవ్" పిల్లలకి పరిమితి లేకుండా అల్లరిచేయాలని ఉంటుంది, పిల్లలకి చక్కని వ్యాయామం వారికి ఆయాసం వచ్చేవరకూ వారిని పరిగెత్తనివ్వడమే; అదే వారి ఊపిరి తిత్తులకి, ఆరోగ్యం కల్గచేస్తుంది, అంటాడు. "ఆనాడే దేహానికీ మనస్సుకీ మధ్య సరియైన సంబంధం ఏర్పడి దేహాభివృద్ధికి మానసికాభివృద్ధికి దోహదం కల్గుతుంది" అని అతని అభిప్రాయం.

పిల్లలలో వారి వయస్సుకి మించిన ముదిభావాలు కలగకుండా వారిని కాపాడడం కోసం, ఈ విద్యాసంస్థలో తగిన ఏర్పాట్లు చేశారు, దుర్భావాలు కలగచేసే హాస్యపు రచనలు, నాటికలు, ఫిల్ములుగాని, జూదంలో అభిలాష కల్గచేసే రకం యంత్రాలు ఆటవస్తువులుగాని, లైంగిక భావాలకి దారితీసే రచనలు, ఫోటోలు మొదలయినవిగాని వారికి లభ్యం కాకపోవడంచేత, వారికట్టి భావాలు కల్గవు. వారికక్కడ వీటిస్థానే ఆకర్షణీయమైన ఆటలు, వ్యాయామం, చేపలు పట్టడం, నడక, ఈత, స్కావ్రీ, టేబిల్ టెన్నిస్ సీతాకాలంలో మంచుమీద జారడం, మొదలయిన వ్యాసంగాలు ఏర్పాటు చేశారు,

ఫోటోలుతీసి వాటిని డెవలప్ చేసే లేబరేటరీ, యాంత్రిక కర్మాగారాలు, మొదలయినవి ఈ విద్యాసంస్థలో వున్నాయి, వైద్యసౌకర్యాల కోసం, ఎక్సరే పరికరాలు, రేడియేషన్ పరికరం. మర్దనాలకి వీలయే పరికరాలు ఉన్నాయి, అధునిక విధానాల ననుసరించి బలవర్ధకమైన అహారం, క్రమపద్ధతిలో జీవితం, కావాల్సినంత విశ్రాంతి నిద్ర ఉంటుంది, ఈ విధమైన జీవితంవల్ల బాలురు ఏవిధమైనవ్యాధులకి గురికాకుండా బలంగా, దేహదార్ఢ్యంతోనూ మానసిక అరోగ్యంతోనూ పెరిగి, పెద్దవారయి జీవిత సంగ్రామంలో ధైర్యసాహసాలతో పాల్గొనగలరని వారి అభిప్రాయం. "ఇంద్రా"

# అంతర్వేదన

## శ్రీమతి పఠానేని శ్రీశైలభ్రమరాంబ

ప్రయాణీకుల కష్టసుఖాల్తో తనకేమీజోక్యంలేనట్లుగా- బొగ్గు నముల్తూ నీళ్ళు త్రాగుతూ, మధ్యమధ్య ఈలవేసు కొంటూ గాఢాంధకారాన్ని చీల్చుకుని పట్టాల నంటిపెట్టు కొని ముందుకు సాగిపోతోంది జనతాఎక్స్‌ప్రెస్-

అర్ధరాత్రి సమయంలో ప్రశాంతంగా నిద్రపోతోన్న గోదావరి బ్రిడ్జిమీదనుంచి నెమ్మదిగాకదుల్తోంది ట్రెయిను. కంపార్టుమెంటులోని ప్రయాణీకులు కళ్ళు మూస్తూ తెరుస్తూ మగతనిద్రతో సతమతమౌతున్నారు. ఓ ప్రయాణీకుడు మాత్రం అదేపనిగా కిటికీలోనుండి బయటకు చూడడంవల్ల యింజన్‌వదలే బొగ్గురవ్వలు కంట్లోపడి కళ్ళను ఎర్రపరుస్తూన్నాయి. అయినా యివేమీ పట్టించు కోకుండా పిచ్చివానిలాగా గాఢాంధకారంలో ఏదో జార విడుచుకున్నట్లు. దానికోసం వెతుక్కుంటూన్నట్లు అదే పనిగా బయటకి చూస్తున్నాడు. అంతలో టికెట్టు కలెక్టరు వచ్చి భుజంతట్టి "టికెట్టుసార్!" అనేవరకూ అతనికి స్పృహలేదు. టికెట్టు తీసుకుంటూ అతని ముఖం పరికించి "ఆనందరావుగారూ!" అంటూ పల్కరించాడు మాష్టరు. అతని పలకరింపుకి జాలిగాచూస్తూ తలవంచు కున్నాడు ఆనంద్-మాష్టరు వెళ్ళిపోయాడు. కాని ఆనంద్ మాత్రం జరిగిపోయిన సంఘటనలని తలుచుకొంటూ కారు చీకటిలోకి చూస్తూన్నాడు. కంపార్టుమెంటులో వాళ్ళంతా ఇంచుమించు నిద్రాదేవికిస్వాగతమిచ్చారు. కాని ఆనంద్ మాత్రం కిటికీలోనుంచి ప్రకృతిలోకి చూస్తూ అల్లాగే కూర్చుండి పోయాడు. అతని మనస్సు కుమిలి పోతోంది. అతడు అంతకంతకి క్రుంగిపోతున్నాడు. అతని హృదయంలో పెళ్ళపెళ్ళున గునపంతో కొట్టి నట్లుగా వుంది. గొడ్డలి దెబ్బలు తింటూన్నట్లు విలవిల్లాడి పోతున్నాడు. అతని కనురెప్పలు రెపరెపలాడి కనుకొన లనుంచి బొటబొటా నీళ్ళు కారుతున్నాయి. అల్లా జీవ శిలలా సీటుమీద కూర్చున్నాడు. అతనికి ఎంతదుఃఖం పొంగిపొర్లి వస్తూన్నా భోరున ఏడ్వటానికి వీల్లేనిస్థితిలో కూర్చున్నాడు.

లేతవయస్సులో ఆరనిఆశలతో వున్న అతనికి చివ రకు మిగిలింది అంతర్వేదనే. మానవుడు కని, విని, ఎరుగని అనేక నూతన విషయాలని గుర్తించి తనశక్తి నంతా ధారవోసి రకరకాలప్రజ్ఞల్ని వెల్లడిస్తూ భూమిమీదే కాకుండా, ఆకాశంలో కూడా ఏముందో తెల్సుకోగల్గు తున్నాడు. కాని యింతవరకూ నిర్జీవులను పునర్జీవితులుగా మార్చట మనేది మాత్రం మానవశక్తికి అతీతమైన సం ఘటన జరిగినప్పుడు ఎవరూ, ఎప్పుడూ, ఊహించని ఆ సంఘటన ఆకస్మాత్తుగా ఎదురవుతే ఎంతతీవ్రంగా వుం టుందో స్వానుభవంతో తెల్సుకొని పొంగిపోతూన్న దుఃఖాన్ని అరికట్టుకోలేక ఆవేదనపడుతున్నాడు ఆనంద్. గట్టిగా కళ్ళుమూసుకున్నా అతని మనస్సు గతజీవితపు పుటల్ని తిరగేస్తోంది.

ఆనంద్ కోటీశ్వరుడైన శంకరశాస్త్రిగారి కొడుకు. చదువుకోసం వాల్తేరు వెళ్ళాడు. అక్కడ ఒక ఏడాది ఆనర్సు పూర్తిచేసి వేసవి సెలవులకి ఇంటికి వచ్చాడు. తమఇంటికి ఎదురుగా ఒకసాలీలయిల్లు. ఆయింటి అమ్మా యిని తన చిన్నప్పటినుంచీ ఎరుగును. కాని ఆనాడు తను గాయత్రిని చూడగానే కళ్ళు చెదిరాయి. అంతకు ముందు పదహారు వసంతాలనుంచి తనతో ఆడి పాడిన గాయత్రి యీనాడు అరవిచ్చుకున్న గులాబీలా మెరసిపోతోంది. చూస్తూండగానే అతని హృదయంలో ఆమె హత్తుకు పోయింది.

ఒకరోజునఅప్రయత్నంగా గాయత్రీఆనందులు ఎదురు పడ్డారు. "గాయత్రీ! నిన్ను పదహారేళ్ళనుంచీ చూస్తున్నా, యీమధ్య నీలో ఏదో కొత్తదనం కన్పిస్తోంది" అన్నాడు ఆనంద్. ఆ మాటకి ఆమె పెదవులపై చిరు నవ్వు చిలకరించింది.

"గాయత్రీ! రాత్రి మావాళ్ళంతా సినిమాకి వెడ్తారు. మీ వాళ్ళనికూడా వెళ్ళమని ప్రోత్సహిస్తాను. నువ్వు మా యింటికి వస్తావా?"

లేతవయస్సు, నవయౌవన మధుమాసపు రోజులు. చిన్ననాటినుంచీ తనతో ఆడిపాడిన వాడు ఆనంద్. వారికి స్నేహలత అల్లుకుపోయింది. ఈ నాడు ఆతడు రమ్మంటే ఆమె కాదంటుందా? ఆనందంతో తన అంగీ కారాన్ని వెలిబుచ్చి తుర్రున పారిపోయింది.

శాస్త్రిగారు శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణులైనా, వారింటి ఎదుటి భీమలింగం కుటుంబం వారితో ఎంతో కల్సిమెల్సి వుండేవారు. రాత్రి అంతా కల్సి రెండో ఆట సినిమాకి ప్రయాణాలై వెడ్తూంటే, జ్వరంగా వుందని గాయత్రి, చదువుకోసం అని ఆనంద్ ఆగిపోయారు–

మినుకుమినుకుమనే నక్షత్రకాంతిలో గాయత్రి ఆనంద్ కోసం వచ్చింది. తహతహలాడే హృదయంతో ఆమెను

చెయ్యిపట్టుకు లోనికి తీసుకువచ్చాడు. ఏదో తెలీని అహం దానందంలో మునిగిపోయారు గాయత్రీ ఆనందులు.

రెండు పావురాలు ఒకటిగా ఎగిరినట్లు, రెండుకోయిల లొకటై కూసినట్లు, వారి మనస్థితి రకరకాలుగా మారిపోయి ఒకరినిచూచి ఒకరు మురిసి ముగ్ధులై తన్మయత్వంతో తమనితామే మర్చిపోయారు. ప్రపంచాన్ని మరిచి వారిద్దరూ మాట్లాడుకొంటున్నారు. వారి హృదయాలు కూడా అస్పష్టంగా మాట్లాడుకున్నాయి. భావోద్రేకంలో మైమరచి పోయారు. వారిద్దరూ కూడా మత్తులో పడిపోయారు. వారిచేతులు, శరీరాలవలెనే వారిహృదయాలు కూడా బంధింప బడ్డాయి. ఆబంధంలోని అనుబంధం వారికే అర్థంకాని అయోమయస్థితి.

వారిద్దరి మనస్సుల్లోనూ వారిజాతినిగురించి, కులాల్ని గురించి సాంఘికాచారాలని గురించి ఆలోచించే శక్తిలేక పోయింది. వారిమధ్య ఓ పెద్ద అఘాతముందనీ భయంకరమైన కులతత్వాలతో విచ్ఛిన్నం చేయరాని ఇనుపతెర మధ్య దించబడిందనీ, జాతిభేదంతో వారిప్రేమ వారిని ఛేధించడానికి తమవాళ్ళంతా కాచుకు కూర్చుంటారని వారు గుర్తించలేకపోయారు. వెన్నలాంటి మెత్తని మనస్సులు, లేత హృదయాలు. నీతి నియమాలు, సంఘాన్ని సాంఘికాచారాన్ని అన్నింటినీ అధిగమించిన ప్రేమతో వారిద్దరూ పెనవేసుకు పోయారు—

గాయత్రికి చిన్నప్పుడు గవరమ్మ అని పేరుపెడ్తే, ఆనంద్‌కి ఉపనయనం అయిన నాటినుంచీ ఆమెని గాయత్రీ అని పిల్చేవాడు. అందమైన పేరు కావడంచేత అందరూ ఆనాటినుంచీ గాయత్రీ అనే పిలుస్తున్నారు. గాయత్రి తల్లిదండ్రుల చాటున అపురూపంగా పెరిగినబిడ్డ. మిసమిసలాడే యవ్వనం. నవనవలాడే సౌందర్యం. కళకళలాడ్తూ ఆనాడే విప్పారిన జాజిమల్లెలావుంది. ఆనంద్ కూడా రెండుదశలు దాటని నూనూగుమీసాల యువకుడు. జవ్వనపు తొలిచూపులోనే ఆమెను చూచాడు. జాతిమత భేద మెరుగని పాలసంద్రంలాంటివాడు. చిన్ననాటినుంచీ ఆటపాటల్లో కల్సి నేడు మాటల్లో కల్సి, క్షణాలమీద వారి హృదయాలతోపాటు శరీరాలుకూడా ఏకమయ్యాయి. వారిద్దరూ కాలంకూడా ఎంతగడిచిందో తెల్సుకోలేక పోయారు. ఇద్దరికీ విడిపోవడానికి హృదయాలు సమ్మతించలేదు, కాళ్ళు కదలవు, కళ్ళువిడవు. అయినా కాలం ఆగదుకదా, సినిమానుంచి ఆనంద్ తల్లితండ్రులు గాయత్రీ తల్లిదండ్రులు అంతా వచ్చారు. గదిలోవున్న వారిద్దరికీ ఏడుపొచ్చే పర్యంతం అయింది. అంతవరకూ తియ్యని చీకటిలో వున్నవారికి తల్లితండ్రుల పిలుపులు సింహగర్జనలా విన్పించాయి. ఆరాత్రిమటుక్కి గాయత్రీ ఆనంద్‌లను చూచీచూడనట్లు ఊరుకొన్నారు పెద్దలంతా—

శాస్త్రిగారి బత్తాయితోటలోకి రెండువైపులనుంచీ చిలకల్లా ఎగిరివచ్చి కల్సుకుంటూండేవారు. గాయత్రీ ఆనంద్‌లు. ఇల్లా చాలాసార్లు జరిగిపోయింది. అడపాదడపా వారిద్దరూ అందరికళ్ళా పడిపోయారు.

ఈ సంగతి కాస్తా మెల్లిగా ఊరంతా పొక్కింది. రహస్యం రట్టయింది. వారి ఉభయుల తలిదండ్రులకు తెల్సిపోయింది. అంతా నకనకలాడి పోయారు. కుల పెద్దలవరకూ వెళ్ళింది. ఊరుఊరంత ఉగ్రులైపోయారు, అసలే ఆ ఊరంతా సాలీలు ఎక్కువ కావడంచేత, వారందరి బుర్రలూ వేడెక్కి మెదళ్ళు కరిగి నీళ్ళలా సలసలా మరగడం ప్రారంభించాయి. వారి కులాచారాన్ని ఈ బ్రాహ్మణ కుటుంబంలో ఆనంద్ ధ్వంసం చేశాడని వారంతా విలయనృత్యం చేశారు. మిగతా బ్రాహ్మణ కుటుంబాలుకూడా అదిరిపోయాయి. ఆనంద్ తల్లిదండ్రులు, గాయత్రి తలిదండ్రులుకూడా క్రుంగిపోయారు. గ్రామసంఘాలన్నీ ఒక్కమారు గర్జించాయి. సంఘకర్కశకరాళ రథచక్రాల తాకిడికి ఆ రెండుకుటుంబాల వారి హృదయాల్లోంచి హాలాహలం విజృంభించి దానిఫలితంగా అమాయికులగు గాయత్రీ ఆనంద్‌ల ప్రేమ భాండం బ్రద్దలైంది.

ఆనాటినుంచీ గాయత్రీ ఆనంద్‌ల మధ్య ఓ యినపతెర దించబడింది. వారి పవిత్రప్రేమ జ్యోతుల్ని విడదీశారు. వారిరువురిలోనూ వికసిస్తూన్న ఆనందపుష్పాల్ని బలవంతంగా త్రుంచేశారు. ఇద్దరి శరీరాలు బంధించబడ్డాయి. ఇద్దరిహృదయాలు అంధకారంలో అంతర్లీనమైపోతున్నాయి. విలాసాలతో విలసిల్లుతూన్న వారి హృదయాలు వియోగంతో విలవిల్లాడుతున్నాయి. పెనవేసుకున్న వారిప్రేమలతను మొదలంటా త్రెంచి గిరవాటువేశారు. ఇద్దరూ అంధకారంలో అలమటించిపోతున్నారు, క్షణమొకయుగంలా తోచి అన్నపానాలుకూడా ఆవలకు నెట్టేశారు. వారి దీనస్థితికి వాళ్ళ తల్లిదండ్రులెంతో నచ్చచెప్పారు. అయినా ఆ యువతీయువకుల హృదయావేదన ఆర్పడం వారికి సాధ్యంకాలేదు. బిడ్డలస్థితిని గమనించిన తలిదండ్రుల గుండెలు నీరయి పోతున్నాయి. అయినా వారి కలయికకు మాత్రం ఒప్పుకోలేదు.

కొన్ని రోజులు గడిచిపోయాయి.

ఒకరోజు రాత్రి ఆనంద్ గాయత్రీకూడా ఎవరికి వారే సాహసించి అర్ధరాత్రి సమయంలో బయటకు వచ్చారు. తల్లిదండ్రులు బంధించిన గొలుసులు తెగిపడ్డాయి. వారి బంధాలకి గండిపడ్డట్టుగా ఇద్దరూ చేయి చేయి కలుపుకొంటూ స్వేచ్ఛగా తోటలోకి పరుగెత్తారు. అది అర్ధరాత్రనికూడా వారు తల్చుకోకుండా అర్థంలేని ఆప్యాయతతో తన్మయులై పోయారు.

"గాయత్రీ! నిన్ను వదలి క్షణంకూడా వుండలేను, నన్ను పెళ్ళాడ్తావా?" అన్నాడు.

"మరి మన కులాలు?"........అంది.

"హాస్టలు జీవితంలో అల్లాంటివన్నీ మర్చిపోయా. అదీకాక గాంధీగారి అడుగుజాడల్లో నడవాలని ఆశయం గలవాడిని; నిన్ను పెళ్ళాడ్డానికి నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు.

"మరి చదువో!"

"చదివినంత వరకూ నిన్ను పోషించడానికి సరిపోతుంది. ఈ కులతత్వాలకోసం ప్రాకులాడే క్రూరపిశాచాలకి దూరంగాపోయి హాయిగా జీవిద్దాం!"

విడివడిన వారి ప్రేమలత మళ్ళీ పెనవేసుకొంది. ఆనంద స్వరాలతో వారి హృదయ విపంచిక మీటుతూ తన్మయులై పోయారు. ఆ ప్రేమమూర్తులిద్దరూ శాశ్వతానందంకోసం జంటపక్షుల్లా ఊరువదలి ఎగిరిపోయారు.

పుట్టిన రాయలసీమ, పెరిగిన గంజాంజిల్లా, చదివిన వాల్తేరుపట్నం వదలి గాయత్రితో సహా కోనసీమకు వచ్చాడు ఆనంద్. ఒక చిన్నఉద్యోగం సంపాదించాడు.

జీవితంలో ఎవరూ పొందలేని ఆనందాన్నీ స్వర్గ సౌఖ్యాల్నీ పొందారు గాయత్రీ ఆనంద్‌లు. విశ్వ సౌందర్య మంజులామృత మాధుర్యాన్ని తనివారా గ్రోలారు. ఎల్లప్పుడూ కడుపునిండిన ఆనందంతో, చిరునవ్వుతో సంతృప్తిగా మూడు వసంతాలు మూడురోజుల్లా గడిపేశారు గాయత్రీ ఆనందులు. అంతలో గాయత్రి మాతృమూర్తిస్థానం వహించింది. ఆనంద్ ఆనందంతో మురిసిపోయాడు. గాయత్రి అతని వళ్ళో మెరసిపోయే కళ్ళతో కొత్త పెళ్ళికూతురులానే వుంటుంది. మాసాలు పూర్తయ్యేకొద్దీ మరీ హాసాలతో విలాసాలతో రోజులు గబగబా దొర్లిపోతున్నాయి వారిద్దరికీ.

గాయత్రికి ప్రసవసమయం వచ్చింది. జాగ్రత్తగా లేడీ హాస్పటల్‌కి తీసుకువెళ్ళి చేర్చాడు. క్షణమైనా ఆమెని వదలి ఉండలేని ఆనంద్ రాత్రింబగళ్ళు ఆమె గదిలోనే వుండేవాడు.

గాయత్రి ప్రసవవేదన పడ్తూంటే ఆ గదికి బయట కూర్చున్న ఆనంద్‌కి ఆ నొప్పులన్నీ తనకే వస్తూన్నట్లు అనిపించింది. అటూఇటూ హడావిడిగా పరుగెత్తే నర్సులని చూస్తూంటే....ఆనంద్ గుండెల్లో తేళ్ళు, జెర్రులు, పాములు, రైళ్లు పరుగులెత్తుతూన్నట్లుగా వుంది. క్షణక్షణం లోపలినుంచి వచ్చే పసిపాప ఏడుపుకోసం ఆతృతగా ఎదురు చూస్తున్నాడు.

........క్షణంలో అతనిఆశ తలక్రిందులైంది. గాయత్రి యింక తనదికాదని పిడుగులాంటి వార్త చెప్పారు. క్షణమైనా వదలివుండలేని గాయత్రి శాశ్వతంగా తనని వదలి అలసినట్లుగా గాఢ నిద్రపోయింది. ఈలోకంలో గాయత్రి తప్ప తనకింకెవ్వరూ బంధువులు లేరని నమ్మికొన్న ఆనంద్‌కి అంతర్వేదనమాత్రం మిగిల్చి అంతర్ధానమైంది.

అరుణోదయంతో పాటు ట్రెయిను బరంపురం స్టేషనులో ఆగింది. ఇంకా కిటికీలోనే తలపెట్టుకు కూర్చున్న ఆనంద్‌ని శంకరశాస్త్రిగారు "అబ్బాయీ!" అని పిల్వడంతో చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుంటూ ట్రెయిన్ దిగాడు దిగులుగా. నిల్చున్న ఆనంద్‌ని తల్లీదండ్రీ చెరో ప్రక్క పట్టుకుని బయటకు తీసుకువచ్చారు.

---

"దెబ్బకు దెబ్బ తీయటం" పాశవనీతి; దుర్జననీతి. ఆ పద్ధతి నలవరచుకొన్నవారి కార్యపర్యవసాన దినం రాకపోదు. వారపుడు తమచేష్టల ఫలితాలను అనుభవించక పోరు. కేవలం. ఆటవికం అయిన క్రౌర్యనీతితో ప్రపంచం విసిగిపోయింది, కాబట్టి, శత్రుత్వానికి బదులు మిత్రత్వం, అసత్యానికి బదులు సత్యం, అసహనానికి బదులు సహనం, ధైర్యవంతులు అవలంభిస్తారు. ఈ న్యాయసమ్మతమయిన నీతి నశించి, దుర్జననీతి విజృంభించిననాడు ప్రపంచం ఇంతకు మూడింతలుగా వినాశోన్ముఖం అవుతుంది.

(గాంధీజీ)

# పరివర్తన

**"సుభాషిణి"**

అద్దాకచిరుపల్లె- అక్కడ నివసించే ప్రజలు కష్టమెరుగని వారు. అలాంటి పల్లెలో అకాలవర్షంవల్ల పంటంతా నాశనమై చిన్నరైతులకు మరింత నిరుత్సాహాన్నొనగూరుస్తున్నట్లున్నా, ఆ యా పంటచేలు. ఇదేసందని ఆసాములంతా కౌలుదార్లను మరీబాధిస్తున్నారు. ఇటువంటి కౌలుదార్లలో సోమయ్య ఒక్కడు.

ఒకప్రక్క దరిద్రం. మరోప్రక్క కూతురు కళావతి పెండ్లికెదిగింది. ఈయేడు ఎట్లయినా పెండ్లి చేసెయ్యాలని తలంచాడు. ముహూర్తాలతో సహా అంతా నిశ్చయమయ్యాయి. కాని తన ఆసామీ నడిగితే, అతడు అప్పు ఇవ్వడానికి నిరాకరించాడు. "ఎవరిని అడిగినా నిరాకరించారు. ఇక ఆశలన్నీ ముగించుకొని కడపటగా ఊరికరణాన్నడిగితే-, ఆయన కావేళ ఏమిబుద్ధిపుట్టిందో- అడుగుతూనే డబ్బులిచ్చి, తనతోటనుంచే అరటిమట్టలు తోలించాడు.

పెండ్లి సంబరాలన్నీ మొదలయ్యాయి. అమ్మలక్కలంతా చేరి, పని లేకున్నా, పని చేస్తున్నట్లు అటూ-ఇటూ పరుగులెడుతున్నారు. ఇరువైపులనుండి బంధువులంతా వచ్చి చేరారు. వరునిపక్షంవారికి అన్ని సదుపాయాలు లోటులేకుండా చూస్తున్నాడు సోమయ్య.

పెండ్లిప్రయత్నాలన్నీ బాగా జరుగుతున్నా, సోమయ్య గుండె "గుభిక్" మంటూనే వుంది; పెండ్లికొడుకేమో తనకు కట్నం వద్దంటూ ఆధునిక నాగరికత నవలంబిస్తానంటున్నాడు పెద్దదేశోద్ధారకునివలె. అతనితల్లేమో కావాలంటూ భీష్మించుకు కూర్చుంది. తల్లి సమ్మతి లేకున్నా పెండ్లి జరిగి తీరాల్సిందేనంటూ పట్టుబట్టాడు వరుడు!

పెండ్లిపందిరి సకలకళలతో దేదీప్యమానంగా వెలుగుతోంది. కల్యాణమంటపము పట్టువస్త్రాలు, బంగారునగలు ధరించిన పడుచులతోను, బోసినవ్వులు వెదజల్లే పాపాయిలతోను, పురుషులతోను, కళకళలాడుతోంది. సర్వాలంకారశోభితులై పెండ్లికొడుకు, పెండ్లికూతురు, పెండ్లిపీటలపై ఆశీనులై యున్నారు.

బాజాభజంత్రీలు మారుమ్రోగుతున్నాయి. పురోహితులవారు వరుని చేతికి మంగళసూత్రాన్నందించారు. కళావతి కంఠాన మూడుముళ్ళు పడ్డాయి. కళావతిలో ఏదో నూతన కళ ఆర్భవించినట్లయింది. అదే అదనని పెద్దలంతా అక్షతలు చల్లారు. అంతాలేచి, కల్యాణమండపాన్ని వదిలి గృహములోని కేగుతున్నారు.

ఇంతలో అటగల నొకయమ్మ "అయిపోయింది. అంతా అయిపోయింది. కళావతి పరాయి వారిచేతుల్లోకి పోయింది, ఇక ఆమె జీవితమంతా దాస్యవృత్తితోనే...."

కళావతి చెవులలో ఈమాటలు పడ్డాయి. కళావతి వదనము కళావిహీనమైంది. భర్త ముఖంలోనికి చూచింది, భర్తముఖం ఏదో సంతోషాన్ని, సంతృప్తిని వెదజల్లుతున్నట్లుంది. 'తనను చేపట్టి, తనకు తనదాసిగా చేసుకున్నందుకేనా ఆసంతోషం!' అన్నట్లు ఆమెలో యేదో (తమాషా) భావం కలిగింది. వెంటనే శాంతమూర్తని పేరుగాంచిన కళావతి రౌద్రమూర్త్తయింది.

ఒక్కసారి భర్త వ్రేలిని విడిచి, ముఖాన్ని చేతులతో కప్పుకొని 'నాన్నా!' అని బిగ్గరగా కేకేసి, సభ్యత తెలీకుండానే, వడిగా తనగదిలోనికి దారి తీసింది: ఒక్కపరుగుతో, ఎక్కడివాళ్ళక్కడ స్తంభించిపోయారు. సోమయ్య ఏమయిందో అని వడిగా కుమార్తెదగ్గఱి కెళ్లాడు. ఎన్నడూ కోపమన్నదే చూడని కుమార్తెయందు కోపంతో మండే కళ్ళాయనకు కనబడ్డాయి. 'ఏమిటీ హఠాత్సంఘటన?' అంటూ సోమయ్య ఒక్కసారి ఆశ్చర్యచకితుడయ్యాడు.

"అమ్మా! కళావతీ! ఏమిటిదంతా?" ఆయనగొంతు బొంగురుపోయింది. ఏమి సమాధానమిస్తుందో నని ఎంతో ఆశతో చూచాడు. కాని కూతురినుండి ఎట్టిసమాధానాన్నీ రాబట్టలేక పోయాడు.

"తల్లీ! ఏమిటమ్మా యిది! ఎందుకీకోపం? చెప్పమ్మా! నీతండ్రికి చెప్పమ్మా! చెప్పు—!" అంటూ ఎంతో బుజ్జగించినట్లు. కాని సమాధానం శూన్యం. సోమయ్య ఆతురత ద్విగుణీకరించింది....

"తల్లీ! కళావతీ! ఏమిటమ్మా! నాదగ్గఱ ఎందుకీ దాపరికం? తల్లి లేకపోయినప్పటికీ ఎంతో గారాబంగా, కంటికి రెప్పలాగ కాపాడిన ఈ తండ్రియెదుటనా ఈ రహస్యాలన్నీ! ఏదీ దాచకమ్మా! నాబంగారు" తల్లివి కదూ! నీ హృదయంలో ఏదో బాధవుంది. ఎందుకా బాధ? ఎందుకు తల్లీ ఈశుభవేళ కన్నీరు? చెప్పమ్మా! నీకేం లోటు కలిగింది? చెప్పవూ?"

"లోటు.... అంతాలోకే.... నాన్నా.... నీస్వార్థం కోరి ...."

"ఆ....నాస్వార్థమా తల్లీ!" ఏమిటీ మాటలు? స్వార్థమని "ఎవరన్నారు తల్లీ నీతో? ఏమిటమ్మా యిదంతా? ఎప్పుడూ ఎదిరించి మాటలాడి ఎరుగని నీ వీనాడిట్లా మాటలాడుతున్నావేమిటి? అసలు....విషయంచెప్పమ్మా!"

కళావతి నెమ్మదిగా "నిజమేనాన్నా! ఎన్నడూ నిన్ను యెదిరించి మాట్లాడలేదు. కాని ఈనాడు మీమనః ప్రకృతిని గ్రహించగలిగాను, మీ స్వార్థం కాకపోతే.... కట్నం లేదని దాస్యానికి నన్ను వప్పగిస్తున్నారా! అబ్బ ఎంతఘోరం...." అని అంది.

సోమయ్య గంభీరంతో కూడిన గొంతుకతో, పొరపడుతున్నావమ్మా! కట్నం లేదని కాదు తల్లీ!....వాళ్ళు కట్నం అడిగితే మాత్రం ఎక్కడో ఒకచోట తెచ్చివ్వలేమా?

దాస్యమంటున్నావు.” ఇప్పుడు నిన్ను దాస్యానికెవరప్పగించారు? “పెండ్లి” అనేది ‘దాస్యమా తల్లీ !

“పావన భారతదేశంలో జన్మించిన ప్రతిస్త్రీ వివాహమాడి తీరవలసినదే ఇది దేశసాంప్రదాయం ! ఏస్త్రీగాని అవివాహహితగా వుండటానికి లేదు. పెండ్లనేది దాస్యం కాదు పవిత్రబాంధవ్యం ! పెండ్లికాని స్త్రీలు భారత దేశంలో చాల అరుదు. ప్రతిస్త్రీకి ‘పెండ్లి’ అనేది ఒక గొప్పసంపద రావటం లాంటిది. అన్ని సంపదలతోను ఈ వివాహబాంధవ్యంలో లభించే భర్తే (పాత్ర) స్త్రీకి గొప్ప సంపద !

అనేకమంది భారతస్త్రీలు భర్తే దైవమని నమ్మి, పతితోడిదే సతికి జీవితమని గ్రహించి, తమభర్తలకు విధేయులైయుండి, వారికి సేవచేసినవారు. భర్తకేగాదు, అత్తమామలకు, బావ- మరదులకు విధేయులైయుండినారు. అట్టివారివల్లనే మన భారతదేశ మీనాడింత పేరుప్రఖ్యాతులతో వెలుగొందుతూంది. సతీమతల్లుల సౌశీల్యమే మన భారత జాతికి మాయని రత్నఖని. స్త్రీ ఇంతగొప్పది కావటానికి మూల మీవివాహమే— అట్టిదానిని నీవు ‘దాస్య,మని భావింతువా తల్లీ !”

“‘తల్లిల్లొకటి, అత్తవారిల్లొకటి’ అని భావించువారికి అవి పరాయిఇంట్లో చేసే దాస్యంలాగానే- వుంటుంది. అట్లుకాక ‘రెండూఒకటే, అని తలుస్తే అదే స్వర్గలోక కార్యముగా పరిణమిస్తుంది. అన్నిటికీ మూలమైన దీమనస్సే అందుకే నీమనస్సును అదుపులో పెట్టుకోమంటున్నాను. తల్లి! ఎంత అపోహపడ్డావమ్మా ! ఇంతకాలం నిన్ను గారాబంగా పెంచి, దాస్యానికి లోను గానిస్తానామ్మా ! లేదమ్మా లేదు ! అదీ నీయిల్లే; అక్కడివారంతా నీవారే. ఇక్కడ లభించే సౌఖ్యమే నీకు అక్కడ లభిస్తుంది. నా మాట నమ్మ కళావతీ !”

తండ్రిబోధ విన్న కళావతి మనస్సు మారిపోయింది. కొంతకాలం ముందున్న కోపము, దుఃఖము కళావతినుండి దూరమయ్యాయి. అందుకే స్త్రీలమనస్సు లూసరవిల్లి మార్చే రంగుల్లా వుంటాయంటారు పెద్దలు !

ఒక్కసారి పశ్చాత్తాపముతో కళావతి తండ్రికాళ్ళ మీద వ్రాలింది. సోమయ్య కండ్లనుండి రెండు నీటిబిందువులు వళావతి తలపై బడి ఏదో దీవెన వచనముల వెదజల్లాయి. సోమయ్యాప్యాయంగా కూతురుని లేవనెత్తాడు.

“నాన్నా ! తెలీక నానామాట లన్నాను. నన్ను క్షమించవూ !”

“పిచ్చితల్లీ ! ప్రతిమానవులకు కలిగినదే ఈదార్బల్యం-”

ఇంతలో ఒకామె సోమయ్యా ! కొంపమునిగింది. పెళ్లికొడుకు వాళ్ళు వెళ్ళిపోతున్నారు. త్వరగా రావయ్యా !” అంటూ పరిగెత్తుకొచ్చింది.

తండ్రీకూతుళ్ళిద్దరూ పరుగెత్తారు, పెండ్లికొడుకు పక్షంవాళ్ళంతా బండ్లెక్కారు. సోమయ్యా పరిగెత్తుకొంటూ వెళ్ళి, వియ్యంకునితో “అయ్యా! నాపై ఎందుకీ ఆగ్రహం? ఆపిల్లకేదో బాగులేదట. అందుకని భర్తను విడిచి గదిలోకెళ్ళితే, ఇంత ఆగ్రహమా? నామీద దయవుంచు.... నాయనా ! అల్లుడా ! నీవైనా దయవుంచవా? అగ్నిసాక్షిగ పెండ్లియాడిన భార్యను విడిచి వెళ్తావా..?”

“స్వామీ ! నాతప్పు క్షమించండి. నామీద దయచూపండి. మీరు వలదన్నా నేను మీదగ్గరే దాసిగా పడివుంటాను. నన్ను స్వీకరించరా స్వామీ?” అంటూ కళావతి ఆర్తనాదం మొదలుపెట్టింది.” వరునిహృదయం కరిగింది, “సరే, బండెక్కు” అన్నాడు.

కళావతిసంతోషంతో బండెక్కింది. సోమయ్య పూలు, పసుపు, కుంకుమ తెచ్చి ఓ ముత్తయిదునచేత ఇప్పించాడు.

“తల్లీ ! ఇవే నీకు రక్షగా వుంటాయి. అన్నిటికన్న ఇవే నీకన్ని విధాలా అత్యుత్తమమైనవి, భారత స్త్రీకి పసుపు కుంకుమ, పువ్వే అత్యంత ప్రీతికరమైనవి, పవిత్రమైనవి. పేదవాణ్ణయిన నేను నీకీగల ధనమిదే ! నీభర్తే నీకు సర్వస్వం. నీ పసుపు కుంకుమలు ఎల్లప్పుడు నిలుస్తుంది. అన్ని కష్టాల్లోనూ ఇవే నిన్ను కాపాడగలవు! వేళయింది. ఇక బయలుదేరండమ్మా !” అంటూ సోమయ్య కూతురికి కన్నతండ్రిగా ఓదార్పుమాటలు పలికి వీడ్కోలిచ్చాడు.

‘వస్తా నాన్నా !’ అంటూ కళావతి. తండ్రిని వీడ్కొంది. తండ్రిబోధచే ఎన్నడూలేని క్రొత్తకళ ఆమెలో ఉద్భవించి, కళావదనానికి మరింత శోభను, కళను చేకూర్చింది. కూతురిమోము చూచిన తండ్రి ఒక్కసారి సంతోషంగా గాలి పీల్చాడు.

పెండ్లివారి బండ్లు పెండ్లికొడుకును, పెండ్లికూతురుని తీసికొని, ఘంటలు మ్రోగించుకొంటూ ప్రయాణం సాగించాయి. !

నా జీవితమంతా జూదరిగానే గడపినాను. నిర్విరామంగా సత్యంకొరకు ఓర్పుతో అన్వేషిస్తున్నాను. దౌర్జన్య రహితం అయిన ప్రశాంతమార్గాన్ని నా విశ్వాసంకొద్దీ వెతుకుతున్నాను. నాశ్రమ కత్తివాదరమీది సాముకంటేకూడా కష్టమయిందే. అయితే, లోక క్షేమకరం.

(మహాత్మాగాంధీ)

మొదట నీ కంట్లోని దూలాన్ని తీసిపారెయ్యి. అప్పుడు నీ సోదరుడి కంట్లోని నలుసును తీసి పారెయ్యటానికి నీ దృష్టి నిర్మలం అవుతుంది.

(ఏసుక్రీస్తు)

# కాశ్మీరదేశపు కవయిత్రి

భగవంతుని సౌందర్యనిలయం అనదగిన కాశ్మీరంలోని నిట్టూర్పు గాడ్పులోనహితం భాషామాధుర్య మంజుల త్వాదులు శోభించే కవితాకళ ప్రకాశిస్తూ ఉంటుంది. ఆసీమలో అసమానురాలైన కవయిత్రి 'హబ్బాఖాటూన్' (Habba Khatoon) అనే నారీశిరోరత్నం, అందాలరాణి; గుణమణులబరణి, ఆమె పద్యాలు చదివేవారి హృదయాల్లో నిశితంగా నాటుకొని, కొంతసేపటివరకు తన్మయత్వంతో తాము కడచిననెల బాకీలు తీర్చలేదన్న విషయమే మరచిపోయేట్టు చేస్తుంది.

హబ్బాఖాటూన్ చరిత్రము అతివిచిత్రమయినది; సొంపయినది. ఆమె 16 శతాబ్దంలో ఒకగొల్లకుటుంబంలో జన్మించింది. ఆమె నేర్చినవిద్య చాలస్వల్పము; అది కూడ ఇంటిదగ్గర నేర్చినదే. ఆమె తలిదండ్రులు ఆమెను 'అబ్దుల్ రథీర్ (Abdul Rathir) అనే సామాన్య కర్షకకుమారునకిచ్చి పెండ్లిచేశారు. కాని, ఆదంపతుల మనస్సునకు ఏమాత్రం ప్రశాంతి ఉండేదికాదు. ఖాటూన్ తన్ను అవమానకరంగా అగౌరవపరచే అత్తగారి బాధలకు తట్టుకోలేకపోయింది- ఆమె తనకు తగిన ప్రియుని గూర్చి యెంతో కలవరించింది, కాని ఆకలవరింతలకు అనుగుణంగా రూపసౌభాగ్యాలతో ఒప్పే పురుషునికి తన గాఢానురాగాన్ని అర్పించే ప్రాప్తిమాత్రం ఆమెకు లేకపోయింది. ఈచింతతో ఆమె హృదయము విశ్రాంతి లేనిదయింది. ఆకారసౌష్ఠవం ఇలాంటిదని యేర్పడని తన వలపుకానిమీది ప్రేమయొక్క తీవ్రత ఆమె గీతరూపముగ వెలువరించింది. ఆహా! కాశ్మీరఖండ కవయిత్రి! ఆకవయిత్రి నిగూఢప్రేమాతిశయ మనోహర భావములు! ఔరా! అనుభవ పూర్వకములయిన హృదయనిక్షిప్త మహదాశయాలకు, వాడి—వేడిమి—అత్యధికముగదా! ఆకాలంలో పారశీకభాష ఆప్రదేశాన వ్యవహారంలో నిరాటంకంగా వాడబడుతూ వచ్చింది. తన అభిప్రాయాలను 'ఖాటూన్' పారశీకంలోనైనా-లేదా- కాశ్మీరిలోనైనా ప్రకటించేది. కాన, ఆకవయిత్రి మాతృభాషలోనే కాక, వ్యావహారికం అయిన పారశీకంలోగూడా పద్యాలు— పాటలు పాడేది. అప్పుడు కాశ్మీరప్రభువయిన 'యూసఫ్ షా చాక్'— (Yusuf Shah Chak) ఆమె పేరు ప్రతిష్ఠల్నిగూర్చి ఆలించాడు. ఒకానొకదినం ఆమెవసించే 'చాందహార్' — (Chandahar) గ్రామంగుండా అతడు గుఱ్ఱపుస్వారి చేస్తూ రావలసినపని పడింది. ఆతరుణంలో వీనులకు విందుగూర్చే 'ఖాటూన్' కంఠనాదం వినబడింది. యూసఫ్ పరవశుడై, ఆదిక్కునకు దృష్టులు ప్రసరింపజేశాడు. ఆమె సౌందర్యాన్ని పరికించి ముగ్ధుడయ్యాడు. అతఁడు అనుకోని విధంగా, ఈక్రిందిగీతం అతని కంఠన్నించి వెలువడింది :—

> "పల్లె పడుచా! కన్నతియ జగమెల్లఁ దనకు
> చానిసతనంబొనర్ప నెంతేని మెలఁగుఁ
> బ్రేమికులు పరస్పరమిదె ప్రేమజూపఁ
> దగినబుతువును వచ్చె మోదమ్ము చెలఁగు!!"

ఆ గొల్లకన్నియ ఖాటూన్ సహితము తిన్నని—తియ్యని కంఠస్వరంతో :—

> "కాని, యోరాచకొమరుఁడ, యీనిశిథి
> యిదె, తనదు నీడతోఁ గప్ప నేఁగుదెంచు,
> వర్తిలెడు నింట నొకఁడె నావల్లభుండు,
> నేనో, యచ్చటి కేఁగంగలేను జుమ్ము"||

రాజు పిలుపు ఆమెకు అందించబడింది. కాని, తాను కలగన్న ప్రియుడు లోకాతీతమయిన తన మానోజ్ఞతకు లోబడి పంపిన అస్పష్టమయిన పిలుపును (రాజాజ్ఞను) తిరస్కరించునంతటి గుండెధైర్య మామెకు ఎట్లు అలవడెనో, ఎవరు చెప్పగలరు? అదృష్టాదృష్టముల పర్యవసానములు చూచినవారెవరు గలరు?— ఖాటూన్ కాశ్మీరదేశపు రాణియై వైభవములతో తులతూగగలుగుట ఆమె భాగ్యవిశేషమే.

రథీరు 'యూసఫు' మహారాజును అతనిఆస్థానంలో సందర్శించి, తనభార్యమీద నేరాలు మోపాడు. తాను ఆమె అపరాధకారణంగా దౌర్భాగ్యజీవితాన్ని గడపాల్సిన స్థితి సంభవించిందని మొఱబెట్టుకొన్నాడు. ఆమె పొలంలోని ధాన్యాన్ని తూరుపెత్తి, రెండుసేర్ల గింజలయినా సమకూర్చలేంది అని వాపోయాడు, పొద్దస్తమానం గీతాలు గేయాలు ఆదేపనిగా ఎన్నయినా చెప్పగలదని అన్నాడు. ఊళ్ళో ప్రతివాడి నోటంటా.... ఆమె గేయాలే వస్తూంటాయి అని ఆక్రోశించాడు. కడకు అతడు ప్రభువుతో "మహారాజా! ఇక నాకు ఆమె భార్య కాదు. భార్యలేకుండా సంసారం గడవదు. కనుక రెండవ వివాహానికి తాము సమ్మతించ వేడుకొంటున్నాను"— అన్నాడు. వెంటనే యూసఫ్ అపుడు రాజ్యమంతటా వ్యవహారంలో ఉండే 5,000 దీనారాలను రథీరుకు ఇప్పించి, ఖాటూన్‌తో విడాకులర్పించేట్టు ఉత్తర్వుచేశాడు.

ప్రకృతం యూసఫు, మంత్రముగ్ధుడిమొస్తరు ఖాటూన్ అడుగాజ్ఞలకు లోబడి, భృత్యానుభృత్యుడుగా

జీవితం గడపసాగాడు. ఆమెకు స్వప్నాగతుడైన పురుష దెవడో, అట్టి పురుషుని, అట్టిరూపరేఖలు గలవానిని ఆమె పెండ్లాడుటలో తనకు అభ్యంతరం లేదని యూసపు తెలిపాడు. ఖాటూన్ ఈఅవకాశాన్ని దొరక పుచ్చుకొన్నది. జారవిడుచుకొంటే, తన స్వప్నవృత్తాం తమేనిష్ప్రయోజనం— అసత్యం కావలసివస్తుంది. పైగా అరచేతిలోని ఉసిరికవలె తనకై సిద్ధంగా ఉన్న రాజ్ఞీ పదము తొలగిపోతుంది. కాన ఒక శుభదినాన పెండ్లి కుమార్తెవలె అలంకరించుకొని- శోభనగృహాన ప్రవేశిం చింది. యూసపుకూడా— భూషితుడై ఆమెను అనుగ మించాడు. కొంతసేపటివరకు ఇరువురు మౌనముద్ర వహించియుండిరి. తుదకావధువు మిలమిలలాడు మెఱపు చూపులు గలనయనాలు తెఱచి చూడగా, ఎదుట తన నాథుడయిన యూసపు దృష్టిగోచరుడయ్యాడు. ఎంతటి విస్మయజనక మాసంఘటనము : వారిరువురి ప్రేమ ఎంతటి గాఢమయినదో, ఈకథవల్ల మనం గ్రహింప గలము.

14, 15 శతాబ్దుల్లో— కాశ్మీరదేశమందు రాజ కీయాలు విపరీతంగా చెలరేగేయి. ఈకాలంలోనే కాశ్మీర రాజ్యపరిపాలన ముస్లిములకు హస్తగతమయింది. యూసపు షా అంతఃపురాన ఆనందడోలికల్లో వూగుతూ మహావైభవాలతో ఆత్మసమ్మోదం పొందుతూ కాలం గడిపే సంరంభంలో రాజ్యాంగవిషయాల్లో— దేన్లోనూ జోక్యం పుచ్చుకోకుండా వుంటూవచ్చాడు. అతని యెడ ఎక్కువచనవుగల 'హబ్బాఖాటూన్'— అతణ్ణి దుర వాట్లు మాని, ప్రజాసౌఖ్యం— రాజ్యపరిపాలనం దృష్టిలో పెట్టుకొమ్మని అనేకవిధాల, పలుమారు ప్రార్థిం చింది. కాని, యౌవనమదమత్తుడై, అనుభవంలేని హేతువున— ఆమెహితవును పెడచెవిని బెట్టాడు. అతడి అలసభావం—సోమరితనం, మంత్రులసలహాలకు కూడా, తగిన సమాధానము అతడిగుండా రానీయని స్థితికి తెచ్చినాయి. అతడి వాలకాన్ని చూచి యిదివరకే మనుస్సు విరిగిపోయిన ప్రధానమంత్రి 'సయ్యదు ముబారక్ ఖాన్ బైహాకి' (Syed Mubarak Khan Baihaqi) తనపదవికి రాజీనామా ఈయగా, 'మహమ్మద్ భట్'— అనే అతనిని యూసపు ఆపదవికి నియమించాడు.

ఈక్రొత్తప్రధాని అప్రయోజకుడని తేలింది. మహా రాజు పరిపాలనలో అశ్రద్ధచూపటం గ్రహించి, సామంత మండలాధీశులందరూ. అబ్దుల్ ఖాన్ భట్ నాయకత్వం క్రింద 1580లో మహారాజుమీదికే తిరుగబడ్డారు. శ్రీ నగరంలోని వంతెనలు మొదలైనవానిని పడగొట్టారు. తమ సైనికాది బలాలను అభివృద్ధిచేసేనిమిత్తం, వాళ్ళం దరూ సయ్యదు ముబారక్ బైహాకి సహాయం కోరారు, అతడు ప్రత్యక్షంగా ఈ విషయంలో రాజుతో పగపెట్టు కోటానికి ఇష్టపడక, వాళ్ళని సమాధానపరచటానికి పూనుకొంటూ, తిరుగుబాటుదారులను అలక్ష్యం చేయరాదని నిన్ని, అలాచేస్తే, వాళ్ళకి బలం ఎక్కువ అవుతుందని దనిన్ని మహారాజుకుకూడా చెప్పిపంపాడు. చేడెలక్రీడలలో పూర్తిగా మునిగి ఆవరకే దిగ్భ్రమపడిఉండే యూసఫ్‌షా రాబోవు ఆపదను గూర్చి కించిత్తయినా ఆలోచించకుండా సయ్యదు ముబారక్‌ను, అతణ్ణి అనుసరించినవాళ్ళని చెఱ పెట్టటానికి సేనలను పంపాడు. ఇందువల్ల విప్లవకారు లందరూ తీవ్రక్రోధం వహించి వారితో పోరాడగా, వారందరూ "నావాకేడెల్ (NAWA KEDEL) వంతెన దిక్కు పారిపోయి, యేటిని దాటి. "ఇడ్‌ఘా" (ID GAH) భూములు చేరి. తిరుగబడ్డవారిని మార్కొన్నారు. మహారాజసైన్యం అంతకంతకు క్షీణదశకు రాసాగింది. ఇక దారుణయుద్ధం తప్పదని, తనకు రాజ్యభ్రష్టత్వం ఆసన్నమయిందని రాజు దిగులుపడి, రాజలాంఛనాలన్నీ విసర్జించి, తగుమాత్రమయిన అంతఃపురపరిజనంతో ముఖ్యనగరాన్ని వదలిపెట్టి బ్రినాల్ లామార్ (Brinal Lamar) పర్వత భూములకు పారిపోయాడు. ఈ కొండలు 'కుల్గాం' తహసీలు (Tehsil Kulgam) కును. పీర్ పంజల్ ప్రాంతాని (Pir Panjal Range) కిని నడుమ ఉన్నది. రాజ్యసింహాసనాధిపత్యం అట్టిసమ యంలో "లోహర్ చాక్" (Lohar Chak) అనే వానికి దక్కింది. ఈలోహరుకు— 'నాదీ ఉద్దీన్' అని బామాం తరము. మహారాణి అయిన హబ్బా యిప్పుడు ఏకాకిగా వదలిపెట్టబడిన స్థితికి వచ్చింది.— ఎన్నటికైన తన మనోహరుడు తిరిగి రాగలడని చాలకాలం ఓర్చింది. తుదకు ఓర్పలేక ఈక్రిందిగేయం పాడుతుంది:—

"గుదులు గుదులుంగ పూవుల గుత్తులెన్నో,
సేకరించితి నాప్రియురాక వేచి,
గుండె లగలంగ నొకటిగం గూర్చియిడితి
ఎన్నడేతెంచు నను జేర వన్నెకాండు?"

రాజ్యము కోల్పోయిన యూసఫ్‌షా 1580 సం॥ జనవరి రెండవ తారీఖున ఫతేపూర్ సిక్రి (FETAHPUR SIKRI) లో మకాంచేసియున్న అక్బరుపాదుషాను సమక్షంలో కలిసికొని కాశ్మీరరాజ్యాధి పత్యం మరలా తనకు దక్కేటట్లు తోడ్పడమని కోరాడు.

సౌందర్యరాశి అయిన హబ్బాతో సౌఖ్యాలనుభవించటానికి మరల అవకాశం కల్పించుకొందామని అతని ఊహే, అతని నిలా ప్రేరేపించింది. మొఘల్‌చక్రవర్తికి కాశ్మీర దేశంమీద చాలాదినాలుగా కన్నుఉన్నది, కనుక తాను కోరకుండానే తగినఅదను తనంతట ఇప్పుడు లభించింది. ముఖ్యంగా దాన్ని మొఘల్‌సామ్రాజ్యాన చేర్చాల్సనే అతనిపేరాస. కాబట్టి వెంటనే యూసఫ్ కోరినవిధంగా రాజా మాన్‌సింగుసైన్యాధిపత్యంక్రింద కొంతసేనను పంపేటట్లు వాగ్దానం చేశాడు. ఇంతలో రాజభక్తిపూరితుడయిన యూసపు ప్రధాని మహమ్మదు భట్ 1000 గురు యోధులను చేర్చియుంచి, లాహోరు నందున్న తన ప్రభువురాకకై ఎదురుచూస్తూ ఉండినాడు. ఢిల్లీనించి మొఘల్‌సేనతో యూసపు అక్కడికి వచ్చిచేరగానే భట్టు—"మొఘల్ ప్రభుత్వం" తాత్కాలికంగా సహాయంచేసినా, దానివల్ల కలగనున్న ఆపదలనుగూర్చి వివరించి చెప్పాడు. వెంటనే యూసపు తన ప్రధాని ఊహించిచెప్పిన విషయాల్లోని యాథార్థ్యం గ్రహించి, తన పొరపాటును గుర్తించి మొఘల్‌సేనను విడిచిపెట్టి తానుమాత్రమే కాశ్మీరం చేరినాడు. చాలశ్రమపడి యూసపు 4000 మంది వీరులను చేర్చికొని, సరాసరి కాశ్మీరంమీదికి దండువెడలినాడు, యూసపు షా సైన్యం, ప్రకృత కాశ్మీరదేశాధిపతి అయిన లోహరు షా సైన్యం 'నౌషెరా' (Nowshera) సమీపంలో మార్కొని యుద్ధంచేశారు. కాని, లోహరుసైన్యం శత్రుసైన్యాన్ని అరికట్టకుండా గుట్టకొకడు చెట్టుకొకడుగా పిక్కబలం చూపి పరుగెత్తారు. దాంతో లోహరుఓటమి, యూసపు మరొకసారి సింహాసన మెక్కటం సంభవించింది.

ఈరెండువసారి రాజు కావడంలోని కష్టసుఖాలు స్వయంగా అనుభవించటంవల్ల— యూసఫ్ రాజ్యాన్ని చక్కగా పరిపాలన చేయసాగాడు. అన్నివిషయాలలో హబ్బాఖాతూన్ ఎప్పటికప్పుడు తగినసలహాలు ఇస్తూ వుండేది. ముఖ్యంగా ఆమె ప్రోద్బలంచేతనే ఆస్థానంలోని నాట్యాంగనలయిన భోగపుస్త్రీలను మహారాజు తొలగించాడు. రాచబికపు కార్యకలాపాలను అతడే స్వయంగా పరిశీలించేవాడు. శత్రురాజులను అణగార్చి, ప్రశాంతమయిన స్థిరపరిపాలనకు పునాదులు దిద్దితీర్చాడు. ప్రజలమొఱలను దయార్ద్రభావంతో ఆలకించి, తగినరీతిని వాళ్ళకి సహాయపడేవాడు. రాజభాండరములోని ద్రవ్యాన్ని పొదుపుచేస్తూ, మితంగా అవసరములకు వ్యయపరచేవాడు. పద్యకావ్యాలు మొదలయినవాటియందు— గూఢక్రియలయందు శ్రద్ధవహించేవాడు. హబ్బాయొక్క రాజకార్యధురంధరత్వాన్ని చాలామెచ్చుకొనేవాడు. కాని, ఏ రాష్ట్రంలోను ప్రశాంత వాతావరణం శాశ్వతంగా నిలువదు. కాశ్మీరభూమియందంతటా అంతఃకలహాలు చెలరేగాయి— యూసపు షా తెలివిగల కుతంత్రంతో తన్ను మోసగించినందుకు అవమానంపొందిన అక్బరుచక్రవర్తి ఈఅంతఃకలహాలు రేపేవారికి బాసటగా ఉండి కాశ్మీరాన్ని కబళించటానికని రాజా భగవాన్‌దాసు నాయకత్వంక్రింద కొంత సేనను ఇచ్చి అది యూసపుకు తోడ్పడటానికనే నెపంతో పంపాడు. చక్రవర్తిసేనలు కఠినములైన గుట్టలమీది రాళ్ళమార్గాలలో అనేకకష్టములకు అగ్గమయి, వరదలు, వాగులు, తుపానులు మొదలగువాటివలని బాధలు తప్పించుకొని కాశ్మీరదేశంలో అడుగుపెట్ట ప్రయత్నిస్తూ వుండినవి. దానికితోడు అకాల హిమపాతంచేత, రహదార్లూ, రాచబాటలు త్రోవలకు అడ్డమయినవి. వారు తెచ్చుకొన్న ఆహారపదార్థాలుకూడా ముగియవచ్చినవి. ఇట్టి అవస్థలకు గురిఅయిన తనసేనయొక్క దీన దశను చూచి యూసఫ్ షా తో అప్పట్లో సంధిచేసుకోవటమే యుక్తమని భగవాన్‌దాసు ఊహించాడు. వెంటనే వార్షికంగా ఇంతకప్పం చెల్లించాల్సనీ, సర్వస్వతంత్రంగా కాశ్మీరాన్ని యూసఫే యేలుకోవచ్చునని ఒడంబడిక చేసుకొని, దాన్ని స్థిరీకరించటానికి చక్రవర్తిదగ్గరికి మహారాజునుకూడా వెంట తీసికొనివెళ్ళాడు. కాని, చక్రవర్తి ఆసంధిసూత్రాలకు సమ్మతించకపోవటమేకాక, యూసపును చెరసాలలో బంధించటానికి ఉత్తరువిచ్చాడు. చక్రవర్తి తనమాట దక్కించి గౌరవించలేదనే అవమానంతో భగవాన్‌దాసు ఆత్మహత్య చేసుకొన్నాడు.

అతరువాత మొఘల్‌చక్రవర్తి యూసపు షాను వంగదేశానికి ప్రవాసిగాపంపి, అక్కడ అతడికొక జాగీరును ఇచ్చాడు. హబ్బాఖాతూన్ భర్తృవిరహమనే విషసర్పపు కోరలకు పాలై తనహృదయాన్ని విప్పి, అనేక విధాల అంగలార్చింది. ఆయంగలార్పులే గేయాలుగా— గీతాలుగా— దేశమంతటా అల్లుకొన్నవి. ఆగేయాలు ఇప్పటికిని చదివేవారికి సరిక్రొత్తవిగా తోస్తాయి; కాశ్మీరిభాషలో గల శబ్దమాధుర్య, మార్దవ, మంజులత్వాల పుంజాలైన ఆసాధ్వీతిలకంయొక్క స్వానుభూత నిగూఢభావములెంతగంభీరాలయినవో, ఎంతసున్నితములయినవో, ఎంతటి ప్రేమానురాగద్యోతకములయినవో, ఎంతటి పావనములైనవో ఆభాషలో నిష్ణాతులైన రసజ్ఞులకందరికీ తెలిసినవే.

మనస్సున నాటి కరుణాతరంగితములు చేయతగిన ఆగేయాలు ఆమెయే తనచరమదశలో స్వయంగా వ్రాసినవి,

ఆమె వార్ధకస్థితిలో నిర్విరామంగా నదులు, సరస్సులు, క్రీడావనాలు మున్నగువాటి ప్రాంతాల్లో సంచరిస్తూ వాటిని గూర్చి సహజోక్తులతో వర్ణించింది. సువాసనలు వెదజల్లే పూలరాసులను, మానవజాతిలోని బద్ధానురాగమును, ఎడబాటువలని విపరీతచింతనుగూర్చి ఆమె చెప్పిన గీతాలు అద్వితీయాలు,

"ఓయీ, చెలికాఁడ, యెపుడు భాగ్యోన్నతి నను
గాంచి చిఱునగవున వచ్చి కౌగిలించు?
హృదయమును వీడిపోయిన ప్రేమ నన్ను
మరల నెప్పుడు సంతోషపఱచుఁ, జెపుమ
ఓర్మి మెయిఁ జాలకాల మేనోర్చియుంటి"॥

ఆమె దివ్యసౌందర్యాన్ని, మనోనురాగాన్ని మన యెదుట ఈక్రిందిగీతికలు ప్రత్యక్షం చెస్తాయి.

"పన్నెచిన్నెల పచ్చిక బయళులవిగో !
అందముంగూర్చు, నామోఱలాలకింతె?
గుట్టల సరస్సులను బూచుఁ గుసుమసమితి
గిరుల మైదానములయందుఁ దిరుగ రమ్మ
అవిగో ! వికసించె దూరంపు టడవిఁ బూలు"॥

శ్రీనగరానికి మూఁడుమైళ్ళదూరాన చుట్టూ రాతిపిట్ట గోడగల రాజకుటుంబంవారి శ్మశానం ఉంది. అందులోనే ఈకాశ్మీరి కవయిత్రియొక్క భౌతికశరీరం పాతిపెట్టబడింది. ఇందులోని సమాధులకు పైకప్పులు లేవు. ఏలనంటే, షియ్యాతెగకు చేరిన మహమ్మదీయుల కట్టివి ఉండరాదట!

ప్రతిసంవత్సరం కాశ్మీరులు ఇక్కడి హబ్బాసమాధివద్ద సమావేశం—అయి, తమమాతృదేశంలోని యీకాశ్మీర కుమారిని సంస్తుతిస్తూ వుంటారు. అట్టిసమయంలో అక్కడ బజారుల సంతకూడా జరుగుతుంది.

(శ్రీ- యస్. ఏ. హాజ్‌నాథ్ ఆంగ్లంనుండి అనువాదం)

# మదన మోహన శిల్ప విద్యాలయం ఢిల్లీ

పోటీలలోగాని పరీక్షలలోగాని వస్త్రప్రదర్శనాలలోగాని తామే మొట్టమొదటి వారుగా వచ్చినందుకు గర్వించేవారు ఏకొద్దిమందో ఉంటారు. నిష్పక్షపాతం అయిన న్యాయబుద్ధితో కడచిన 26 సంవత్సరాలుగా తానట్లు ఘనతపొందే సంస్థలలో శ్రీ మదనమోహన శిల్ప విద్యాలయం ముఖ్యంగా గణింప దగింది.

కాలాన్ని అనుసరించి ప్రకృతి సిద్ధంగా సంభవించే మార్పులు ఆనగా, గోడలు పడిపోవటం, పైకప్పులు కూలిపోవటం, వచ్చేవారికి స్థలం చాలకపోవడం - ఈ లాటివి ఎంత నిరుత్సాహపరుస్తూ వుండినా, ఈ సంస్థలోని పనివారు లాభం పొందేవారు. ఎల్లప్పుడు తాము చేసే పనుల మీదనే యెక్కువ నిఘావుంచి, ఏలోటు కలుగనీకుండా అందంగా. నాజూకుగా దిద్దితీర్చే, విషయంలో మిక్కిలి నేర్పు చూపుతూ వుండటం ఎంతైనా మెచ్చదగింది. దీని సంస్థాపకులిప్పటి స్థితిని గూర్చి ఈ క్రింది విధంగా వ్రాయటానికి వెనుదీయలేదంటే, అందులో ఆశ్చర్య పడాల్సినదేముంది? "చాలీచాలని కుటుంబాలకు ఎక్కువ వరుమానం తెచ్చుకోవటాబికి మహిళలకు తగిన సలహాలతో దారి చూపిస్తాం. ఆ కారణంవల్ల చేతిపనుల శాఖను మేము ఇంకా బలపరచాల్సనే ఉన్నది. మాకు ఇలాటి చేతి పనులతో తయారయే వస్తువులకు పెద్దపెద్ద విక్రయ సంస్థలనించేకాక ప్రత్యేకంగా కొన్ని కుటుంబాలవారున్ను అప్పుడప్పుడు వ్రాస్తూవుంటారు. ఈ నాడు మా వస్తు విక్రయ శాలను బొంబాయి, కలకత్తాలలో నెలకొల్ప గలిగినాము. మాకు 26 సంవత్సరాలుగా ఖాతాదార్లయిన వారు, వారికి కావలిసిన వాటికి ముందుగా వాళ్ళపట్టీలలో మాకే అగ్రస్థానం ఇవ్వటమే కాకుండా, మా సంస్థ విషయంలో ఆదరాభిమానాలు కలిగి దాని అభివృద్ధిని ఆశిస్తూ వుంటారు."

నిశ్చయస్థితిలో ఈ విద్యాలయంలోని చేతిపనులు చేసే (స్త్రీల) శాఖను చూచివచ్చే ప్రేక్షకులు పై వాక్యాలను ఏకగ్రీవంగా ఆమోదిస్తారు. ఢిల్లీనగరంలోని 'బాల్లిమరాన్' అనే ప్రదేశమందు ఒక గదిలో నుండి మరొకగదిలోకి వెళ్ళటానికి రవ్వంత వెల్తురు ప్రవేసించే ఒక పాడుపడ్డకట్టడంలో కొంచెం దిగువగా, అంతకంటే ఎత్తుగా, దానికంటే ఇంకకొంచెం ఎత్తుగా మూడంతస్తులు కలిగి కిటికీలకు పైగా వసారాలతో ఆ మందిరం ఒప్పతూంది. ముందరి ప్రక్క ఇదివరకు శిక్షణ పొందిన ఇప్పడు పొందుతూన్న వారికి నీడనిచ్చే పెద్ద వృక్షంకూడా ఆ భవనం ముందుంది. ముందరితట్టే అద్భుతంగా దుస్తులు కుట్టె మొదటి రకం తరిబీతు శాలా ఒక అంతస్తునుండి మరొక అంతస్తుకు వెళ్ళటావికి మేడమెట్లు ఉన్నవి. చేతితోను యంత్ర సహాయంతోను అల్లికపనులు నేర్పే తరిబీతు తరగతి ప్రత్యేకంగా ఉన్నది. ఇక్కడపని నేర్చుకొన్న అబలలు తమ శక్తిసామర్థ్యాలను అనుసరించి నెల 1 కి 15 రూ నుండి, 60ల వరకు సంపాదించుకోవచ్చు. 25 సం॥ రముల క్రింద ఇక్కడ వచ్చిచేరిన స్త్రీలు నేటికిని క్రమం తప్పక వేళకు వస్తూనే వుంటారు. ఇక్కడ ఒక చిన్న గ్రంథాలయంకూడా ఉంది. "సఖీసమాజం" అనే పేరుతో స్త్రీల సమాజం ఒకటి ఏర్పడి ఉంది. అందులో మత సాంఘిక సంబంధాలయిన కార్యాలు ఉత్సవాలు, ఉపన్యాసాలు, సాధారణ సభా సమావేశాలు జరుగుతూ వుంటాయి. ఇప్పడిక్కడి నానా శాఖలలో చేరి తరిబీతుపొందే సోదరీమణులు 101 మంది గలరు. అందులో పూర్తిగా నేర్చికొని స్వయంగా వస్తూత్పత్తి చేయశక్తిగల వాళ్ళు 60 మంది.

ఈ సంస్థలోని చేతిసనుల శాఖా విద్యార్థినులకు నెల 1 కి రు 1000 ల వరకు పంచిపెట్ట బడుతున్నవి. అల్లకము కుట్రపుపని 2 సం॥ ములు పూర్తిగా నేర్చుకొన్న విద్యార్థినులకు 'శిల్పవిశారద' అనే బిరుద మివ్వబడుతుంది. అంతే కాక, ఈ పనులలో ఊహలకొద్ది ఎక్కువగా, ఒక్క సంవత్సరం తమ నేర్పు చూపేవారికి ప్రత్యేకంగా యోగ్యతాపత్రాలు (Certifieate) ఇవ్వబడుతుంది. ప్రతి సంవత్సరం స్వల్పకాల వ్యవధిలో ఈ చేతిపమల తరిబీతుకయి జూలై 15 వ తారీఖు నుండి సెప్టెంబరు 15 తారీఖు వరకు తరగతులు నడుపబడుతుంది. కుట్రపుపని, అల్లకం ఆరు నెలల్లో నేర్వదగిన విద్యలయినా, రెండు నెలలలో ముగించటానికి తగిన కార్యక్రమం నియమించుకొని ఈ సంస్థ పనిచేస్తున్నది. ఇంతగా నారీలోకానికి ఉపకరిస్తూ వున్న ఈ సంస్థ స్థిరంగా నిలిపే విషయంలో పంస్థాపకులు చాల చాల కష్టాలకు గురికావలసి వస్తున్నది. ఈ విద్యాలయ కార్యదర్శిని సంస్థలో తరిబీతునొంది ఆరితేరిన విద్యార్థినులకు కేంద్ర సాంఘుక సంక్షేమ సమితి కధ్యక్షురాలయిన శ్రీమతి దుర్గాబాయిదేశముఖుగారి అగ్రాసనాధిపత్యము క్రింద బహుమతులు యోగ్యతాపత్రములు ఇచ్చిన మహాసభలో తన నివేదికను సమర్పించింది. అందులో ఆమె "ఈ విద్యామందిరానికి సరియైన కట్టడం లేదనిన్ని, ఇక్కడియంత్రసాధనాలు మొదలయినవి వర్షాలవల్లను, సూర్యకిరణాల వేడిమివల్లను చాల చెడిపోతున్నవనిన్ని ప్రతి సంవత్సరం ఈ భవనాన్ని బాగుచేయటానికే చాలడబ్బు అవుతున్నదనిన్ని, చుట్టుపట్ల మరికొన్ని పెద్దకట్టడాలు పెరగడంవల్ల విద్యాలయానికి వచ్చేవారి సంఖ్య తగ్గిపోతున్నదనిన్నీ, మొత్తంమీద ఆర్థికంగా విద్యాశాల అభివృద్ధికి రావడం లేదనిన్ని" నివేదించింది. "ఆకారణంవల్ల ఈ విద్యామందిరంలో మరికొన్ని క్రొత్త విద్యాశాఖలు ఏర్పచితిమి. అవి చాలమందిని ఆకర్షిస్తున్నవి" అనికూడ అ కార్యదర్శిని మనవి చేసింది.

నివేదికాంశాలను సావధానంగా గమనించి, ఆ విద్యాశాల స్త్రీ జనాభ్యుదయానికై చేస్తున్న సేవను మెచ్చుకొని శ్రీమతి దేశముఖుగారు "అనేక సంస్థలకు ఈలాటిచిక్కులుతటస్థిస్తూనే ఉన్నాయి. మహిళాజాతీయ విద్యాసంఘానికికూడా ఈ విషయంబాగా తెలుసును. అందుచేతనే అది 3 వ పంచవర్ష ప్రణాళిలో పెక్కు సాంకేతిక విద్యాలయాలు స్త్రీలకై స్థాపించి పనిచేయటానికి, తద్వారా

నమూనాలు వ్రాసేవాళ్ళను (Draftsmen) సాధారణ, యాంత్రిక శిల్పశాస్త్రజ్ఞులను (Civil & Mechanical Engineers) తయారుచేయటానికి తీర్మానించుకొని, అందు కయి 5 కోట్లరూపాయలు కేటాయించారు. కాన, పలు విధాల సాంకేతిక శాఖలు ఈ విద్యామందిరంలో ప్రారం భించే పక్షంలో తప్పక ప్రభుత్వ సహాయం లభింపగలదు. ఏమాత్రం చెక్కు చెదరని దీక్షతో, సంస్థాపకవర్గం కార్య నిర్వాహక సమూహం, అందులో ముఖ్యపాత్ర వహించిన శ్రీమతి భారతీరామ్, వీరందరు ఏకోన్ముఖంగా ఎప్పటి వలెనే శ్రద్ధపూని పనిచేసేయెడల ఈ మదనమోహన మహిళా శిల్ప విద్యాలయం ప్రజోపయోగకరంగా సేవ చేస్తూ శాశ్వతంగా ప్రకాశింప గలదనుటలో ఏ మాత్రం సందేహంలేదు" అని ఉపన్యసించారు.

(శ్రీమతి ప్రభా రాయిగారి "సోషియల్ వెల్ ఫేరు" లో ఆంగ్లానికి ఆంధ్రానువాదం)

---

# వీట్నాం పల్లెల్లోని జానపద కథానిక

పూర్వం వీట్నాం ఏలే రాజుగారి దగ్గర ఒక అంద మయిన పిల్లి వుండేది. దాన్ని చూచి ఆరాజు చాల ముచ్చట పడేవాడు. అతడు దాన్ని విడిచి ఒక్క క్షణమయిన ఉండే వాడు కాడు. కాని అ వూరిలోనే సామాన్య సంసారి ట్రాంగు క్వేన్. అనేవాడు ఆమార్జాలంమీద కన్ను వేశాడు. ఎలాగో, దాన్ని అపహరించాడు. ఆ మగపిల్లి ట్రాంగు క్వేన్‌కు ఒకఅతిథి మోస్తరుగ, తయారై చనువుతో మెలగ సాగింది.

అయినా పట్టుదలగల క్వేన్ ఎలాగైనా దాన్ని ఇంకా మాలిమి చెయ్యాలనుకొని ఒకక్రొత్త మార్గం కనుక్కొ న్నాడు. ప్రతిదినం రెండు కంచాలలో ఆహారం సిద్దపరచే వాడు. ఒకదాన్లోనేమో—నానా రకాలయిన చవిగల పదా ర్థాలు, మరొకదాంట్లో ఎందుకూ పనికిరాని విడిచిపెట్టిన పదార్థాలు వుండేవి. రాజు దగ్గర ఉన్నప్పుడు విలువగల తిండ్లుతినే ఆ బిడాలం ఈ బీదయజమాని తెచ్చి పెట్టిన రెండు తబుకులలోని వస్తువులు పరిశీలించి అందులో ఇం పైన వస్తువులుండే పళ్ళెంమీదపడి తింటూండేది. రాజుగారి యింట్లో అయితే ఈ పిల్లి చేష్టలను ఆయన సమ్మతిస్తూ, వుండేవాడు. ఈ క్రొత్త పోషకుడు. మంచి ఆహారం మీదికి మళ్ళే వాలకానికి ఒళ్ళుమండి దాన్ని చబుకుతో కొట్టడ మేకాకుండా పళ్ళెంలో మూతిపెట్టే ఆ పిల్లిని చెవులు పట్టుకొని బలవంతాన అవతలికి లాగేస్తూండేవాడు. ఆ పిల్లి చేష్టలు, దాని యజమానుడి క్రూరస్వభావం ఇలా ప్రతి రోజు జరుగుతూ వచ్చింది. తుదకు అది కొంతకాలానికి, తనరాచరికపు ఠీవిని వదులుకోక తప్పిందికాదు. ట్రాంగు క్వేన్ ఆపిల్లి స్వభావాన్ని మార్చేసి, తనదారికది వచ్చేలా చేసుకోగలిగాడు. తన బంగారంవంటి పిల్లిజాడ ఎంత వెతికిం చినా దొరకనందుకు రాజు చాలా విచారపడుతూ వుండ గా, ట్రాంగుక్వేన్ దానిని హరించుకొని వెళ్ళాడని తెలి యవచ్చింది. వెంటనే, అతడు తనయెదట పిల్లితో కూడా ఆ దొంగను హాజరుపెట్టమని, సిబ్బందికి ఉత్తర్వు చేశాడు. వాళ్ళు అలా చేయగా ఆ పిల్లిని చూచి అది తనదే అని గుర్తించాడు.

ట్రాంగుక్వేన్ రాజ ద్రవ్యాపహరణం చేసిన నేరగా డని న్యాయాధికారులు తీర్మానించారు. అప్పుడు క్వేన్ ఇలా వాదించాడు :—"నిజమే. నా పిల్లి తమ పిల్లిని పోలిం దిగా ఉండవచ్చు. కాని, ఇది మాత్రం తమది కాదు. నాదే. దేహమంతా ఉండే వెంట్రుకలనుబట్టి పరిశీ లిస్తే రెండూ ఒకటే కావచ్చు. అంతమాత్రంతో దీన్ని తమదని రుజువుచేయటం పొరపాటు. ఈ రెండే కావు. వేల కొలది ఇట్టివి వున్నాయి. ఈ పిల్లి ఎవరిసొత్తు అని నిర్ణయిం చటానికి ఇంతకంటే దృఢమయిన రుజువు కావలసివుంది."

"మూర్ఖుడా, ఏల నిష్ప్రయోజనములయిన మాటలు? ఇది నిశ్చయంగా నీదని మేము నమ్మగలిగిన మరొక రుజువు ఏదైనా చూపగలవా నీవు?

ఏల చూపలేను? చిత్తగించండి ఘనత వహించిన మహా ప్రభువులయిన తాము ఈ పిల్లికి విలువగలఆహారాలు ఇచ్చి బాగుగా చియ్యబట్టి బలిసేట్టు చేయగలరు. కాని యేపూ టకు ఆ పూట తిండి తీర్థాలను సంపాయించుకొని నావంటి దరిద్రుడయిన యజమానిని ఆశ్రయించినప్పుడు ఈ జంతువు నా బీదరికాన్ని అనుసరించి నేను పెట్టేదాన్ని తిని బ్రత కాలిగదా! గతిలేని నేను నానారుచులతో గూడిన ఆహా రాన్ని దీనికి ఎలా సంపాదించి పెట్టగలను? మీరు పరిశీలించి చూడాల్నంటే ఒకదాన్లో నుంచిది, మరొక దాన్లో పనికిమాలింది అయిన తిండ్లుగల కంచాలు రెండు తెప్పించండి. ఇప్పుడే తేలిపోతుంది."

రాజు సమ్మతించి అట్లే చేయించాడు. బీదవాని యింట్లో వాడుకపడ్డ పనికిమాలిన కంచంలో తిండిని ఆతు రతతో తినింది. ట్రాంగుక్వేన్ జయించాడు. పిల్లిని అతనికే రాజు అప్పగించాడు. రాజు సభ్యులూ నోళ్ళు తెరుచుకుని నిశ్చేష్టులై చూస్తూ ఉండిపోయారు.

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of January, 1961.

**OUT-PATIENT REGISTER:—**

| | | |
|---|---|---|
| | No. of Surgical cases treated | 52 |
| | " " Medical " " | 733 |
| | " " Ante-natal " " | 254 |
| | " " Post-natal " " | 62 |
| | " " Gyneac " " | 146 |
| | " " E.E.N.T. " " | 22 |
| | " " Dental " " | 10 |
| Total | " " New Patients | 1,279 |
| " | " " Old Patients | 815 |
| | Grand Total | 2,094 |

**IN-PATIENT REGISTER:—**

| | |
|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | 135 |
| " " " " Abnormal Deliveries : (Forceps : 12 Face : 1 ) | 13 |
| No. of Surgical cases treated | 7 |
| " " Medical " | 14 |
| " " Post-natal " | 2 |
| " " Ante-natal case with False Pains | 23 |
| " " Ante-natal case with Toxaemia | 2 |
| " " Gyneac cases | 27 |
| " " Babies admitted as Lodgers | 148 |
| Grand Total | 371 |

(True Copy)

(Sd.) Dr. K. R. AMBUJA,
*R.M.O.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

(Sd.) Smt. V.LAKSHMI PARVATHI
*Secretary.*

# నీ చలవ

## శ్రీమతి పి. యల్. పద్మావతి గంగాధర్

నా వయస్సుతోపాటు, ఊహల్లోను, ఆశయ, ఆదర్శాల్లోను ఎంతో మార్పువచ్చింది. గతంలో జరిగిన కొన్ని విషయాలుమట్టుకు మర్చిపోవటం సాధ్యం గాకుండావుంది. వంటరిగా కూర్చొన్నప్పుడల్లా ఎదొక విషయం గుర్తుకురావటం. బాధతో, వ్యధతో, కుమిలిపోవటం, జరుగుతూనే ఉంటుంది. వయస్సుకు గతానికి స్నేహబాంధవ్యాలు లేవనుకొంటూ!

ఇది చాలకాలంనాటి విషయం. నేను బి. ఏ. (ఆనర్సు) చదువుతున్న రోజులు. మానాన్నగార్కి పట్టణంలో ఉద్యోగం. మావూళ్ళో ఉన్న పదిఎకరాలపొలం కౌలుకు యిచ్చి అంతా పట్టణంలోనే ఉండేవాళ్లం. నేను ఒకగానొక్కకూతురు నవ్వటంవల్ల, నేను ఆడిందిఆట పాడింది పాటగా ఉండేది. నాన్నగారు నన్ను కారులో తీసుకొని వెళ్ళి కాలేజిలో దింపి, మరల సాయంకాలంవచ్చి యింటికి తీసుకెళ్ళేవారు. నాన్నగార్కి ఎంతో అర్జంటుపని వుంటేతప్ప, నన్ను బస్సులో వెళ్ళనిచ్చేవారు గారు. ఎంతోహాయిగా కాలం గడ్చిపోతూ వుండేది. కాలేజీలో మాదొకగ్రూపు. దాదాపు అందరంకాస్తో, కూస్తో ఉన్న కుటుంబాలనుండి వచ్చినవాళ్ళమే. ఒకళ్ళు ఏదంటే తక్కిన వాళ్ళందరం తందాననే వాళ్ళం. చదువుకంటే, మేము అచ్చట కల్సి సరదాగా కాలం గడ్పటానికి చేరుతున్నామా అనిపించేది అప్పుడప్పుడు. అందరికీ శెలవులు యిస్తారని సంతోషంగా ఉంటే, మేమంతా ఎంతో బాధపడుతూండే వాళ్ళం. కొంపలు ముంచుకుపోతున్నంతగా భయపడుతూండేవాళ్ళం. చదువు పూర్తి అవుతుంది, ఆ తరువాత మరల కల్సుకొంటామో, కల్సుకోమో నను కొన్నప్పుడు కన్నీళ్ళపర్యంతమయ్యేది. మేము మధ్యాహ్నం యింటర్ వెల్, ఒక 'పిక్ నిక్ కు' వచ్చినట్లుగా గడ్పుతూ ఉండేవాళ్ళం.

ఆరోజులలో, మాక్లాసులో 'సుశీల' అనే ఒక అమ్మాయి ఉండేది. ఆ అమ్మాయి తల్లిదండ్రులు చాల బీదవాళ్ళు. మేమంతా, 'సుశీ', 'సుశీ' అంటూవుండే వాళ్ళం. సుశి ఎప్పుడూ బస్సులోనే కాలేజీకి వస్తూవుండేది. నాకు తెల్సినంతవరకు, సుశి వంటిమీద ఇస్త్రీ బట్టలు ఎప్పుడూ చూడలేదు. అప్పుడప్పుడు చినిగిపోతే కుట్టినవికూడ వేసుకొస్తూండేది. కాని సుశి అందానికి అవి ఏమీ లోటును కల్గించలేదు. మాకాలేజీలో సుశికన్నా అందమైన అమ్మాయిలేదు. ఆమెలో అందం అంత సహజంగా వుండేది. అంత అందమైన అమ్మాయిని, అంత పేదరికంలో దేవుడు ఎందుకుంచాడా అని మేము ఆశ్చర్యపోతూ ఉండేవాళ్ళం. కాస్త ఉన్నకుటుంబంలో పుట్టున్నట్లైతే, తళుకు, బెళుకుల, పై పై పూతలవల్ల ఆ అందంలోని సహజత్వం పోయేదేమో! చదువులోకూడ అంతే, సరస్వతి, లక్ష్మి, ఒకచోటుండవనటానికి సుశి తార్కాణం. మాగ్రూపుతో ఎక్కువగా కల్సిఉండేదిగాదు. వంటరిగా ఉంటూయుండేది. మాగ్రూపులో, అందరికి సుశిఅంటె పంచప్రాణాలు. ఏనోట్సు కావల్సివచ్చినా సుశి యివ్వవల్సిందే. ఏది అర్థంగాకపోయినా, మాకు ట్యూటరులా, సుశి చెప్పవల్సిందే.

మేమంతా సెలెక్షన్సుకు చచ్చీచెడి చదువుతున్నాము. అది పరీక్షలకు మొదటిరోజు. నేను మామూలుగానే కాలేజీకి వెళ్ళాను. ఇంకొక గంటపైముంది. పరీక్షలకు అంతా ముక్కునపట్టి ఊదివెయ్యటానికి తలొకచోట కూర్చొని చదువుతున్నారు, సుశికూడా ఒకమూల కూర్చొనివుంది. కాని ఆముఖంలో రోజూ కన్పించే కాంతి కన్పించలేదు. విచారసముద్రంలో మునిగున్నట్లు కూర్చొనుంది. కన్నీటిచారలు కన్పించుతూనేఉన్నాయి. వంట్లో బాగాలేదేమో, పరీక్షలనుగూర్చి భయపడుతుందేమో నని ధైర్యంచెప్పటానికని దగ్గరకు వెళ్ళాను, సుశి అంటే ఉన్న గౌరవం కొద్దీను.

"ఏమిటి, సుశీ అలాఉన్నావు? పరీక్షలభయమా, పరీక్షలజ్వరమా" అని ఎంతో సంతోషపర్చాలని అడిగా. కాని సమాధానం ఏమీచెప్పలేదు. కళ్ళవెంట నీరుమట్టుకు బొటబొటా కారుతున్నాయి. కొంతసేపు తరువాత వెక్కివెక్కి, ఏడ్వసాగింది.

"ఏమిటి సుశీ ఏమిటో చెప్పవూ?" అని అడిగా ఎంతోదీనంగా, ఏదో జరిగుంటుందనే భయంతో.

"అ... న్న.... య్య" అంది మరీ వెక్కివెక్కి ఏడుస్తూ.

"ఏమిటీ అన్నయ్య ఆరోగ్యం బాగుండలేదా? దీనికే యింత దిగులుపడితే ఏలాగు?" అన్న ఎంతో ధైర్యపర్చాలనే ఉద్దేశ్యంతో.

"కాదు.... అన్నయ్య.... పోయాడు" అని గావురు మంది.

నాకు కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి. పోయిన సంవత్సరం వాళ్ళనాన్న పోయారు. తరువాత సంసారబాధ్యత తను తనమీద వేసుకొని, చెల్లెళ్ళకు, తమ్ముడికి చదువు చెప్పించాలని తను చదువుమానుకొని, గుమస్తాఉద్యోగం చేస్తూ సంపాదించి, సంసారాన్ని గుట్టుగా నడ్పుకొస్తున్న జీవనాధారం కాస్త పోయింది. తండ్రి పోయినతరువాత, తండ్రంతవాడు అన్నయ్య ఉన్నాడుగదా అని ఆశతో బ్రతుకుతున్న సుశి ఆశాజ్యోతి ఆరిపోయింది, 'మూల్గే నక్కమీద తాటికాయి పడిన'ట్లుయ్యింది సుశి జీవితం.

తరువాత ప్రతిరోజూ మాగ్రూపు అంతా కల్సి ధైర్యం చెబుతూండేవాళ్ళం సుశికి. ప్రతిరోజూ సుశి పరీక్షలకు వచ్చిందా లేదా అని విచారిస్తూండేవాళ్ళం, ఎలాగైతేనేం పుట్టెడు దుఃఖంతో సుశి పరీక్షలు వ్రాసింది.

సెలెక్షన్ల రిజల్ట్సు కట్టారు. సుశి బ్రహ్మాండమైన మార్కులతో ప్యాసయ్యింది.

"సుశీ Congratulations"

"Thanks. లక్ష్మీ.... నేను నిన్నొకటి అడుగాలనుకొంటున్నాను..."

"అవును సుశీ. నేనూ కాలేజీకివచ్చి నిన్ను చూడగనే చెప్పాలనుకొన్నా, కాని నీవు ఏమైనా బాధపడతావేమో నెమ్మదిగా చెప్పవచ్చునని ఊరుకొన్నా.... నీవేమీ విచారింపవల్సిన అవుసరంలేదు. నీపక్షరీలకు కాలేజీకి ఫీజు నేనుకడతాను,.... నీవు వేరుగా తలంచవలదు. నన్ను తప్పుగా అర్థంచేసుకొనకు సుశీ"

"అదికాదు లక్ష్మీ.... నేను చదువ దల్చుకొనలేదు... మీనాన్నగారితో చెప్పి ఏదైనా ఉద్యోగం...."

"నీకు ఏమైనా పిచ్చా సుశీ. యింకా మూడునెలలుంటే B. A. (Hons) పూర్తి అవుతుంది.... తరువాత చూద్దాములే..... నామాట కాదనకు"

అనిచెప్పి ఏలాగైతేనేమి సుశిని వప్పించాను. ఆమరునాడు నేను కాలేజీలో డబ్బుకట్టాలని 100 రూపాయిలు నాన్నాగారివద్దనుండి తీసుకొన్నా, ఆరోజు నాన్నగార్కి అర్జంటుపని ఉండటంవల్ల నేను బస్సులో కాలేజీకి వెళ్ళవల్సివచ్చింది. కాలేజీకి వచ్చీరావటంతోనే, సుశి పరీక్షలకు కాలేజీకి Fees కట్టి, రసీదు తీసుకెళ్ళి సుశికిచ్చాను. అవి తీసుకొంటున్న సుశి కళ్ళనుండి బొటబొటా నీళ్ళుకారాయి. నాకళ్ళలో నీళ్ళుతిరిగాయి. ఎందుకనో యిప్పటికీ నాకర్థం కాదు, అలా ఏమీ మాట్లాడకుంగనే యిద్దరం కొద్దిసేపు నిల్చుండిపోయాము.

ఆరోజు నేను యింటికివెళ్ళి, 100 రూపాయలు బస్సులో పోయినవని అబద్ధంచెప్పి, మరునాడు మరల డబ్బు తెచ్చినా, ఫీజుకూడ కట్టాను. తరువాత మూడు నెలలూ ఆదొకరకంగా గడ్చిపోయాయి. నాలో ఏదో మార్పువచ్చినట్లుగా తలపోస్తూండేదానను. పరీక్షలైనాయి. రిజల్ట్సువచ్చాయి. సుశి మొదటితరగతిలో పరీక్షయ్యింది.

మాపరీక్షలైన ఒకనెలరోజులకే నాకు వివాహమయ్యింది. పెండ్లయిన తరువాతనే మావారు I. A. S. Pass అయ్యి, కొంతకాలం Assistant Collector గా పనిచేసి, తరువాత Collector అయ్యారు. వారు కలెక్టరుగా పనిచేస్తున్న రోజుల్లో, ఎవరో ఒక I. A. S. Pass అయ్యిన అమ్మాయి నొకదానిని ఆ ఒకనెల Trainingకు పంపారని, ఆ అమ్మాయి చాల అందంగా ఉంటుందని, ఎంతో తెలివిగలదికూడా నని ఒకరోజున ప్యూనుచెప్పాడు. ఎందుకనో నాలో నేను భయంతో బాధపడ్డాను. ఆనెల అనుమానాలతో, బాధతో, నిప్పులమీద నిల్చున్నట్లుగా గడిపాను. ఆతరువాత కొన్నినెలలకు పెద్దఉత్తరం, ఒకటి ఢిల్లీనుండి వచ్చింది—

ప్రియమైన లక్ష్మీ—

క్షేమం. మీరంతా క్షేమమని తలంచుతాను. నేను యింతకాలంనుండి ఉత్తరం వ్రాయనందులకు క్షమించవలెను. నిన్ను నేను తల్చు కొనని క్షణం లేదు లక్ష్మీ. నీవు నా జీవితగమనాన్ని, గమ్యాన్నే గాదు, మాకుటుంబ జీవిత వ్యవస్థనుకూడ మార్చావు. నీవానాడు చేసిన సహాయం నాజీవితంలో మర్చిపోలేను. మర్చిపోవాలన్నా ఎలా సాధ్యమవుతుంది? ఒక్క క్షణం జీవితాన్ని ఎలా మారుస్తుందో తెల్సుకొంటే, చాల ఆశ్చర్యంగా ఉంటుంది. ఆనాడు నీసహాయ సానుభూతులు లభించకున్నట్లయితే, ఎలా, ఎచ్చట మేమంతా యీసురోమంటూండేవాళ్ళమో, వేరుగా చెప్పనసరం లేదు. మాతమ్ముడు M. B. B. S. Pass అయ్యినాడు. గవర్నమెంటు హాస్పిటలులో పనిచేస్తున్నాడు. మాచెల్లెలు M. B. B. S. చదువుతూంది. వాళ్ళ ఆస్థితిలో యీనాడున్నారంటే నిజానికది నీచలువే. పదిమారులు నీసహాయాన్నిగూర్చి, నిన్ను పొగుడుతున్నానని ఏమీ అనుకొనవుగదూ. కాని మర్చిపోవటం ఎలాసాధ్యం?

ఒక్కవిషయం లక్ష్మీ. నీవు నన్ను క్షమించాలి, నెల రోజులు నీవున్నపట్టణంలోనే ఉండి నిన్ను కల్సుకొనలేక పోయాను. మీశ్రీవారిక్రింద నేను పనిచేసాను. అప్పు డప్పుడు, పాప, బాబు, ఆఫీసుకుకారులో వస్తూండేవారు. బాబుకళ్ళను బట్టి, పాపముఖమును బట్టి, వాళ్ళు నీబిడ్డలని వారు నీభర్త్తగారని ఊహించాను. తరువాత ప్యూనుద్వారా నాఊహ నిజమని తెల్సుకొన్నాను. పుణ్యంకొద్ది పురుషుడు రాతకొద్ది బిడ్డలన్నారు పెద్దలు. ఎంతో అదృష్టవంతురా లవు లక్ష్మీ. దేనికైనా పెట్టిపుట్టాలి,

ఒకరోజు మీయింటికి వద్దామని ప్రయాణమయ్యి, ప్యూనును తీసుకెళ్ళమన్నాను. వాడు నేను మీయింటికి వెళ్ళటం మంచిది గాదన్నాడు, ఆశ్చర్యపోయాను. ఎం దుకో నాకు అర్థంకాలేదు. మనస్నేహన్నిగూర్చి కూడ చెప్పాను, ఒకరోజున సాయంకాలం, మీరంతా కల్సి ఎవ్వరో స్నేహితులింటికి వెళ్ళాలనుకొన్నారట. ఆరోజు, మీవారు ఆఫీసునుండి చెప్పినట్లు రానందుకు. నీవు ఏదో అపవాదులు కల్పించి, కోపంతో అనరానిమాటలన్నావని, అప్యూను చెప్పాడు, లక్ష్మీ, ఆరోజు మేము యిద్దరం నీ వనుకొన్నట్లు ఆఫీసులోనే ఉన్నాము, పాప, బాబు, డ్రైవరు వచ్చారు, అది నేను మీవారికి గుర్తుచేసాను, అప్పుడాయన ఏమన్నారో తెల్సా "నేను తినేది ప్రజల సొమ్ము, నాపిల్లల, భార్య సరదాలు తీర్చేది ప్రజలసొమ్ము, అలాంటి ప్రజలకు నేనెంతో ఋణపడియున్నాను, నా భార్యా, పిల్లలు యీసత్యాన్ని గ్రహించక పోతే అది వాళ్ళతప్పు. ప్రజాకార్యం, దైవకార్యం" అని చెప్పారు. నేను ఎంతో సిగ్గుపడ్డాను. నిజంగా లక్ష్మీ నీవు వారిని అను మానించావా? ఆస్త్రీని నేనేనని నీకు తెల్సునా? తెల్సికూడ అలాఅన్నావా? నేను నమ్మలేదు. నీహృదయం నాకు తెల్సు లక్ష్మీ. ఒకభార్యాలా, అనుకొన్నచోటుకు, వెళ్ళ లేకపోయామే అని బాధపడి మట్టుకు ఉంటావనుకొంటా ఏమైనాగాని లక్ష్మీ, మానవుని మనం అనుకొన్నంత తేలి కగా, ఆశించినంత తొందరగా అర్థంచేసుకొనలేమను కొంటా. ఏపుట్టలో ఏపాముందో చెప్పటం ఎలా సాధ్యం? మరొకమారు నీవు చాల అదృష్టవంతురాలవని చెప్ప దల్చుకొన్నా. నీలాంటి సహృదయులకు, దయా దాక్షిణ్యు లకు, దేవుడు అన్యాయంచేస్తాడా లక్ష్మీ. చేయడు లక్ష్మీ. ఎన్నిటికీచేయడు,

ఇంకా కబుర్లేమిటి లక్ష్మీ. నన్నేదో అడగాలను కొంటున్నావు గదూ! ఏమి వ్రాయమంటావు లక్ష్మీ. ఈ జీవితం దుఃఖభూయిష్టమైనది. క్రుళ్ళుతప్పు, కాళ్ళు, కీళ్ళు లేని యీలోకంలో. సానుభూతి సహకారాలతో బ్రతుకగల్గటం ఎంతదుర్లభమో నీకుతెల్సు. పుట్టిన ప్రతి వారికి, యీప్రపంచంలో ఎచ్చటోఒకచోట, ఎంతో ఒకరంత చోటుంటుంది. అది, ఎక్కడ, ఎంత, అనేది అనేకయితరవిషయాలపై ఆధారపడిఉంటుంది. జీవితం బ్రతకటానికిగాని, నిరాశ, నిస్పృహలతో క్రుంగి, కృశించి చావటానికిగాదు. మానవుడు జీవితపోరాటం సల్పాలి, గెలుపైన, ఓటమైన, క్షణికాలుగా తీసుకొని, జీవితయాత్ర సాగిస్తూ తన విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తిం చాలి, అంతకన్న వేరేమార్గంకూడ లేదేమో! బ్రతుకులో, సొగసు, అందం, ఆనందం, కొంతకాలంవరకే. ఆతరు వాత చాలమంది జీవచ్ఛవాలలా, గతాన్ని తల్చుకొని, పూరటను పొందుతూ కాలంగడ్పటంకన్నా చేయకల్గింది ఏమీ లేదేమోకూడాను, నాకు ఏఅదృష్టమూ లేదు. ఒక రకంగా తృప్తితో బ్రతుకుతున్నానని మట్టుకు చెప్పగలను, నేను ఏదో త్యాగంచేసాననను, కాని నావిధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించాననే చెప్పాలి, అన్నయ్యకూడ పోయినతరు వాత ఆకుటుంబానికి పెద్దను నేనే. అమ్మ వట్టి జబ్బు మనిషి, నేను మొదట ఒకకాలేజీలో ట్యూటరుగా చేరాను. అమ్మ పెళ్ళిచేసుకొనమని ఎంతో బలవంత పెడుతూండేది, ఏవేవో, సంబంధాలనుకూడ, వాళ్ళద్వారా వీళ్ళద్వారా చూస్తూనే ఉండేది. కాని నాకు యిష్టంలేదు. ఈ మనసమాజంలో, నా ఆదర్శాలు, ఆశయాలు చెప్పి, అతని మనస్సుని కూడా తెల్సుకొని వివాహం చేసుకొన టానికి అవకాశాలు అంతగాలేవు, వివాహం చేసుకొన్న తరువాత ఆనూతనవ్యక్తి నాఉద్దేశ్యాలను అంగీకరిస్తాడో లేదో చెప్పటం, జూదంలో గెలుపు ఓటములను గూర్చి చెప్పగల్గటం వంటిది. మాఅమ్మ, తమ్ముడు, చెల్లెల, పోషణభారాన్ని కూడ ఎవరు వప్పుకొంటారు చెప్పు లక్ష్మీ, అలాంటి మహాదాతలు ఉంటారని నేననుకొనను నేను భర్తతో హాయిగా కాలంగడ్పటం— వాళ్ళు చదువు సంధ్యలు, కూటికి గుడ్డకూ లేక యీసురోమని బ్రతుకు తూఉండటం- ఏమంత సబబో, నీవే చెప్పు లక్ష్మీ, నేను నాకోరికలు చంపుకొనగల్గితే, ఎలాగో అలా కష్టపడి, యీకుటుంబాన్ని ఒకమార్గానికి తేగలననే నమ్మకం, పట్టు దల, నానాటికి నాలో ప్రబలుతూవచ్చాయి, లోకం ఏమను కొన్నా— అన్నిటికి నవ్వుతూనే కాలంగడ్పుతూ బ్రతి కాను. మొదటనుండి ఆర్థిక, కుటుంబ పరిస్థితులవల్ల, వేరుగా, ఒంటరిగా, ఎలా మరెవరితో ఎక్కువగా కల్సి ఉండకుండా అనాడు ఉండేదాన్నో, అలాగే నేను

నమ్మినదానికి, నేను మంచి అనుకొన్న మార్గాన్ని అవలంబించాను, అందువల్లనే పెండ్లి చేసుకొనలేను, ఆతరువాత I. A. S. Pass అయ్యాను, మీహారిపద్ద ట్రైనింగు పూర్తియినతరువాత ఢిల్లీ వేసారు, ఆనాడు నీవు సహాయపడ్డావు. యీనాడు మీవారి సలహా, అండ నాకున్నాయి, తల్చుకొంటే జీవితం గమ్మత్తుగా ఉంటుంది. చాలవిషయాలు, లీలగా జరిగిపోతుంటాయి. యీజీవితప్రవాహంలో ఎవ్వరెవ్వరు, ఎచ్చట, ఎలా, కలుస్తారో, ఎలావిడిపోతారో చెప్పలేముకదా! నేను ఆశించినట్లుగానే మాతమ్ముడి చదువుకూడ పూర్తిఅయ్యింది. ఇంకా రెండుసంవత్సరాలలో చెల్లెలుచదువుకూడ పూర్తవుతుంది. వాళ్ళనిద్దరను ఒక యింటివాళ్ళను చేయటమే నేను చేయవల్సినది, అక్కగా, దిక్కూ, మొక్కూలేని వాళ్ళమని వాళ్ళను కొనకుండా, నాశక్తి వంచనలేకుండా, నాసహాయం చేయకల్గాను, ఇప్పుడిక నేను ఎవ్వరిమీద ఆధారపడి ఉండవల్సిన అవుసరంలేదు, ఇప్పుడసలు పెళ్ళి గొడవే లేదు, అవకాశం ఉండిఉండవచ్చు. నేను యింతకుముందు వ్రాసినట్లు, వయస్సుకు, అందానికి ఎంతోసంసంధం ఉంది. ఈనాడు అలాంటి సుఖాన్ని, అందాన్ని నేను పొందలేను, అవివాహితగానే ఆస్థానాన్ని అత్రమించి వాటినన్నిటివి అనుభవించగల్గాను, కొద్దిలో అది నాచరిత్ర లక్ష్మీ, నన్ను అపార్థం చేసుకొన్నావా? చేసుకొంటావా, పూర్వంలా "లేదు" అంటూ, చిరునవ్వుతో నన్ను మన్నించి, సానుభూతి చూపించవూ? మీవారికి నానమస్కారములు, బాబుకు, పాపకు, నాముద్దులు, శెలవు లక్ష్మీ;

"నీ సుశి"

ఆఉత్తరం చదివినతరువాత నాతెలివితక్కువతనానికి ఎంతోబాధపడ్డాను, నాకళ్ళనుండి రెండు కన్నీటిబిందువులు రాలాయి, అవి సుశి, త్యాగమూర్తి అని తెల్సుకొన్నప్పుడు కల్గిన ఆనందంవల్ల రాలిన ఆనందభాష్పాలో, లేక నేను దోషినని తెల్సుకొని, ఒకఅమాయిక హృదయాన్ని బాధపెట్టానే అని పశ్చాత్తాపంతో కార్చినకన్నీరో- నాకు యీనాటికి తెలియదు, ఒక్క విషయంమట్టుకు నిజం. వంటరిగా, ఏదోగా, అమాయకంగా, ప్రశాంతంగా ఉండే సుశి హృదయంలో అలాంటి ఆలోచనలు ఉన్నాయనిగాని, అలాంటి అగ్నిజ్వాల ప్రజ్వరిల్లుతూ ఉంటుందని గాని, ఆనాడు లీలలానైనా నేను తలంచలేదు. నాఅజ్ఞానానికి, యిది అంతా గుర్తుకు వచ్చినప్పుడు చాల కించపడుతూంటాను, చదువుకొనటంవేరు, తోటిమానవుని అర్థంచేసుకొనగల్గటం వేరు, సంస్కారం అంటే తోటిమానవుని అర్థంచేసుకొనటమేనేమో!

"దుఃఖించేవారు నిజంగా ధన్యులు, బాధపడగలహృదయమే ప్రేమించగలదు, అదెంత సున్నితమైనదైతే అంత బాధపడుతుంది. సువిశాల హృదయుల దుఃఖంలో కన్నీటికికూడ అస్కారంలేదు" అనే పెద్దల సూక్తిలో ఎంతసత్యముందో అది నేను 'సుశి'నుండి తెల్సుకొనగల్గాను.

---

## శ్రీ కృష్ణ సంస్తుతి

శ్రీమతి భైరవభొట్ల లీలాసీతారామ్.

రావో! రావో! రాజీవాక్షుని
రామకథామృతము త్రాగుదము

లేవో! లేవో! లీలారమణుని
సుగుణ సంపదలను పొగడుదము!

మదిలో హృదిలో మసలే మాధవు
వదలని భక్తిని ప్రార్థింతము!

వినవో! కనవో! అనుపమ సుందరు
ముదిత మనస్కమయి మ్రొక్కుదము!

దివిలో! భువిలో—శ్రవణ సుందరముగ
భవహరి గాథలె పాడుదము!

నీలో నాలో నిఖిలములో నున్న
అఖిలాత్ము పరమాత్ము నర్చింతము!

ఇహమో! పరమో! ఏదికోరిన నది యిచ్చు,
చిన్ని మోహన కృష్ణు సేవింతము!

పనిలో! పాటలో పంకజనాభుని
సతతము భక్తిని స్మరింతము!

# కోరి చేసుకున్న కోడలు

శ్రీ మండ రామారావు

సంసారం సాగరంవంటిది. ఎన్ని పాట్లుపోట్లయినా కష్ట సుఖాలైనా సంభవిస్తుంటాయ్. ఆయా క్లిష్ట సమయాల్లో వాటికి తట్టుకునే ఓర్పూ, నేర్పూ, వుండాలి. ప్రతివారికీ, సుఖం, కల్గిందని సంతోషించడం, దుఃఖం వచ్చిందని విచారించడం మానవసహజమే అయినా ఏ సమయంలోనైనా సరే ఆనందంగా వుండడమే భావ్యం.

సిరిసంపదలు దైవమిచ్చినవి కావు. అనుకోకుండా జీవితాల్లో తటస్థ పడుతూంటాయ్. పేదవాడు భాగ్యశాలిగా, ధనవంతుడు బీదవాడుగా మారుతూంటాడు. కొందరీ పరిణామాలకు సహించ గల్గుతారు. కొందరా ఛాయలే చూడ్డానికి భయపడతారు. మరి కొందరు వాటికి తట్టుకున్నా పరంపరలకు విసుగూ, కోపమూ, ప్రదర్శించి చిట్టచివరకు సంక్షోభం చెంది ఎన్నో అఘాయిత్యాలకు కారకులౌతారు.

“డబ్బు కావాలి పార్వతీ! అదిలేదని నా కెప్పుడో తెల్సు. అది....” మాంగల్యం వేపు వ్రేలు చూపుతూ అన్నాడు రఘునాధం.

“పౌరుషం లేదూ? మగవారు కాదూ మీరు? మీకు నోరెలా వచ్చిందండీ, ఎన్నిసార్లు చెప్పాను డబ్బు విషయం నా దగ్గర ఎత్తవద్దని?” విసుగూ, కోపమూ మిళితం చేసుకుని చిరాగ్గా అంది.

నల్గురిలో తలవంపులనైనా ఆలోచించు, నాన్నగారి పరిస్థితికి నీ గుండె కరుగలేదూ?”

“ఎవరిగురించైనా సరే ఇహ ఇదిమాత్రం యిచ్చేది లేదు ఇంతవరకూ కుదువబెట్టినవి చాలవూ? ఇంక ఇదే తరవాయైపోయింది. ఇంట్లోంచి పొమ్మంటే పోతాను గాని ఇదిమాత్రం ఈయదల్చుకోలేదు” ఖచ్చితంగా అదురూ బెదురూ లేకుండా చెప్పేసింది.

“వెళ్ళిపోతావ్?....ఎందుకూ వెళ్ళిపోవూ? వెళ్ళు... ఎన్నాళ్ళుంటావో వుండు. బరితెగించి భర్తన్నా, అత్తమామలన్నా భయ భక్తులులేని నీతో కాపురం కొనసాగినట్టే. వెళ్ళమ్మా....వెళ్ళు. ఆలస్యం ఇంకెందుకూ ఊఁ పో... తెగించిన వారికేది దారో అదే నీ దారిన్నిపో.” కోపం అణచుకోలేక, భార్య అనే కనికరమూ చూపక అనేసాడు.

“వెళుతున్నా....” ఒక్కగా నొక్క పిల్లాడ్నీ తోడ్చు [illegible]

“వాడ్ని వదలివెళ్ళు. నేను పెంచుకోగల్ను.” ఉరుముతూ పిల్లడ్ని చేరాడు.

“వీల్లేదు...వీడు నా వాడే నాకే చెందుతాడు” భర్త నోటిని మించేలాఅరచి రెక్కపట్టుకు ఈడ్చుకుపోయింది కొడుకుని.

చేతకాని వానిలా నోరప్పళించి చూస్తూ కొయ్యబొమ్మలా నిల్చుండి పోయాడు రఘునాధం.

పార్వతి సహనం సహించలేక పుట్టినిల్లు చేరుకుంది.

ఇంతకూ కారణం, తనయింటి గొడవ చూచి సహించలేక పోవడమే ఇంట్లో కూర్చుని తింటూంటే గనులైనా తరక్కపోతాయా? మొదట్లో స్థితిపరులైనా జీవనయాత్రలో యావదాస్తీ హరించుకు పోగా చివరకు మంగళసూత్రం వరకూ వచ్చింది. ఆ విషయంలో మాత్రం పార్వతి భర్తకు ఎదిరించింది, మనోవ్యాధితో బాధపడుతూన్న మామగారిమీదనైనా కనికరం చూపలేక పోయింది. దైవసమానుడైన భర్తనే కాదుపొమ్మంది. తను పట్టినపట్టే నెగ్గించుకుంది.

ఇప్పుడాయింటి బాధ్యత పూర్తిగా రఘునాధం నెత్తీమీద పడింది. తండ్రికి మందు తెమ్మని తల్లి జ్ఞప్తికి తెచ్చింది, పాపం! ఆ యిల్లాయికి కొడుకూ కోడళ్ళ కీచులాట తెల్సిందికాదు. భర్తే సర్వస్వమని నమ్ముకున్న సాధ్వికి ఈ లోకంలోని యితర విషయాల్తో అవుసరం వుండదు గాబోలు!

పార్వతి పుట్టింటికి వెళ్ళిపోయిందని అత్తమామలకు తెలియదు. అసలు, రఘునాధం తండ్రికి కొడుకూ యిల్లూ వీటిపరిస్థితుల మూలంగానే మనోవ్యాధి పెట్టుకుని మంచం పట్టాడు. కోడలు వెళ్ళిపోయిన ఉదయంనుంచీ అసలు చైతన్యమే లేకపోయింది. మందిప్పిస్తే తెలివి రావచ్చునేమో! కాని ఆ మందు తేవటానికి పైసాలేదు. తనింత వరకూ కానీ సంపాదించలేక పోయినా దినదిన్నగండంగా గడిచిపోయింది. ఇకనుంచీ రధం ఎలా ఈడ్వడం? రెండురోజుల నుంచీ తండ్రికి మందులేదు సరికదా బ్లా నీళ్ళయినా పోయలేక పోయాడు. తల్లీ, తమా, మంచి నీరు త్రాగే వున్నారు. తమమాట ఏమైనాసరే తండ్రిపట్ల తన విద్యుక్త ధర్మం ఎలా నెరవేర్చడం? పుట్టినదాది పెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి ప్రయోజకునిగా మార్చినా ఏవిషయంలోనూ తను తలిదండ్రులకు సహక [illegible]

కుడు ఈ సమయాన తనలో ఎన్ని మార్పులువస్తే మాత్రం ఏం ప్రయోజనం? ప్రస్తుతం తను డబ్బు సంపాదించాలి తన విద్యాభ్యాస ఫలితంగా తనకుకల్గిన జ్ఞానమూ అనుభవమూ, మేళవించి ఎన్నెన్నో ఆదర్శ ప్రాయమైన కథలూ, నాటకాలూ, పాటలూ వ్రాసాడు. ఎందుకూ? అవుసరానికి పనికిరాని ఆ రాతలన్నీ, నిష్ప్రయోజనాలేగా? పోనీ ఏదైనా బహుమతి వస్తుందేమోనన్న ఆశతో అప్పట్లో మిత్రులు ప్రోత్సహించగా ఉత్తమమైంది. నాటకమొకటి ప్రభుత్వానికి పంపించాడు. నెలలుగడచినా దానికి అతీగతీ లేకపోయిందే! ఆ విషయం స్మరణకు రాగానే రచయితలకుత్సాహమూ, ప్రోద్బలమూ లభింపజేయనీ ప్రభుత్వంమీద ఎంతైనా ఈర్ష్యకల్గింది.

"ముందు మందెలా తెస్తావ్?" తన అంతరాత్మ హెచ్చరించింది. మందు తేవాలి? ఎలా? ఎవరినైనా బదులడిగితే ఎవరిస్తారు? ఏమిచూచి యిస్తారు? తనకే సమాధానం దొరకనపుడు ఆ యిచ్చేవారి కెలా లభిస్తుంది? పోనీ మిత్రుల సహాయానర్థిస్తే లాభంలేదు. ఇప్పటికే అలాంటి సహాయాలెన్నో పొందివున్నాడు. అందరికీ తన దీనస్థితి మొగం మొత్తింది. అందుకే కొన్ని దినాలయి వారి సాహచర్యం లభ్యం కాలేమకూడా.

ఇంటిమీద అప్పుతెస్తే.... ఈకాలంలో పల్లెటూరి యిళ్ళమీద ఎవరికి మోజున్నదని? నాగరీక ప్రపంచంలో డబ్బుకోసం, ఆనందంకోసం,ఏదోబావుకుందామని ఉద్యోగాన్వేషణో మరేదో కారణంగా పట్నాల కెగబాకుతూంటే తనయిల్లెవరిక్కావాలని? పల్లెవాతావరణం ఎవరిక్కాలిరో జుల్లో? ఇంతకీ ఎవరైనా యిస్తే తనతండ్రి అందుకు అంగీకరిస్తాడా? అతని ప్రాణం పోయినాసరే యిల్లు కుదువబెట్టడానికి ఒప్పుకోడే! తరతరాలుగా నివాసయోగ్యంగా వస్తూన్న ఆశ్రయాన్నేమి చేయడానికీ పల్లెత్తు మాటయినా అననీయడే. తిండికున్నా, లేకపోయినా ఆశ్రయంవుంటే పదివేలని భావించే తనతండ్రి స్వభావం తనకు పూర్తిగా తెలుసు.

"మరేమార్గమూ లేదా?" తనకు తనే ప్రశ్నించుకున్నాడు.

"లేకేం ఉంది ఈ ఆలోచనల్లో యిప్పటికే రెండు రోజులువృధాచేసావ్. ఇకనైనా కాలహరణంమాని భార్య దగ్గరకు వెళ్ళి సహాయాన్ని అర్థించు" అంతరాత్మ ప్రబోధించింది.

"ఆఁ!!! భార్యదగ్గరకా? నన్నూ, అత్తమామలనూ కాదని వెళ్ళిపోయిన పార్వతినా అర్థించడం?"

"అవును నీ భార్యనే....ఏం? పార్వతి పరాయిదా? ఆమె నీసహధర్మచారిణిగా, నీ కష్టసుఖాలలో పాలుపంచుకోవలసిన ధర్మం నీ భార్యకులేదా? మొండి పట్టుదలతో వెళ్ళిపోతే అలా ఎంతకాలమని దూరంగా వుంచుతావ్? నువ్వొక్కడివే ఏ కార్యమూ చేయలేవు. అందుకే నీ సహాయార్థమే నీ వివాహం జరిగిందన్న విషయం మరచిపోతున్నావ్. ఎవరి సహాయమో కాంక్షించేకన్నా నువ్వు నీ జీవితపర్యంతమూ భారం మోయవలసిన భార్య సహాయమే తగినది. యదార్థ పరిస్థితి తెలియజేసి లొంగదీసి కర్తవ్యం నెరవేర్చు. ఆమెకూడ హృదయమున్న మానవ జాతిలోనిదే! సందేహాలకు సమయం కాదిది" మళ్ళీ అనుమాన నివృత్తిచేసి హెచ్చరించింది. నిజమే...తను మొదట్లో పొరబడ్డాడు. కోడలంటే తండ్రికి పంచ ప్రాణాలే. తనకు ఈడూజోడూ సరిపోతుందని పార్వతినే కోరి చేసుకున్నారు కోడలుగా అంద చందాలూ, గుణగణాలూ, తెలివితేటలూ వున్నాయ్ అంతలేనివారి పిల్ల కాకపోయినా కట్నకానుకలేవీ తండ్రి నిర్బంధించలేదు. కట్నాలపేరుతో అవతలి సంసారాలు కూలద్రోయడం సుతారమూ తనతండ్రి యిష్టపడక పోవడమే అందుకు కారణం. యిరువురి అంతస్థులూ సరిసమానమైనవే, పార్వతిని కోడలుగా చేసుకున్నందుకు ప్రతిఫలమా అన్నట్లు సర్వపరిచర్యలుచేసి మెట్టినింటి మెప్పులు పొందింది. కాని ఏంలాభం? ఒక్కసారిగా కరడుకట్టిన కష్టాలు (క్రిందటి నెలక్రితంవే) పొంగిపొరలి కట్టలు తెంచుకున్నాయ్ తత్ఫలితంగా పార్వతి వెళ్ళిపోయింది. ఈ విషయం తన తండ్రికి తెలిస్తే ప్రాణం విడుస్తాడే! అందుకే ఆ విషయం తెలియకుండానే పార్వతిని తోడ్చుకురావాలి. దుఃఖభారంతోవెళ్ళినభార్యను సంతోషంగాతోడ్చుకురావాలి, ఒక నిశ్చయానికివచ్చి "ఇప్పుడే వస్తానమ్మా" అనిచెప్పి హుటాహుటి పయనమయాడు మామగారి యింటికి.

అది వేసవికాలం, పదిగంటల సమయం. నిప్పులు విరజిమ్ముతూంది పొద్దు ప్రక్కగ్రామం మూడుమైళ్ళదూరం తను చేరాలి. ఎలా? మూడునిమిషాలలో చేరగల్గితే ఎంత బాగుండును మానవుడు తల్చుకుని ప్రయత్నిస్తే ఎంతటి ఘనకార్యమైనా సాధించ గల్గుతాడు. అవును ఇంతవరకూ తను ప్రయత్నించకనే పనికిరానివాన్నిగా తయారై యిప్పుడిన్ని అగచాట్లకు గురికావలసి వచ్చింది. మనోనిశ్చయానికి మరి తిరుగులేదుగా. మూడు నిముషాలలో కాకపోయినా మూడు అయిదునిమిషాలలో మామగారి యింటి గుమ్మంలోవాలేడు రఘునాథం.

గుమ్మంలో అడుగు పెట్టీపెట్టగానే తన చెవులనుతనే నమ్మలేకపోయాడు.

"వెళ్ళమ్మా వెళ్ళు.... వెళ్ళి పుట్టినింటి పరువూ, మెట్టినింటిమర్యాదా నిలబెట్టు. కోరికోడలుగా చేసుకున్నందుకు అత్తమామలపట్ల ఇలాగేనా ప్రవర్తించేది? ఇంతవరకూ పూజిస్తూ వచ్చిన నువ్వు ఇంతలో యిలా మారిపోయి ఇక్కడకు రావడం లోకానికి తెలిస్తే యేమనుకుంటుంది. ఎక్కువ మంచివున్నా గ్రహించరు గాని కాస్తంత చెడు కన్పిస్తే దాన్నే వేలెత్తి చూపుతారమ్మా! ఇంతకీ సంసారాలలో కష్టాలు రాకుండా వుంటాయా? పోనీ వచ్చాయే అనుకో అవి కలకాలం కాపురం వుంటాయనుకున్నావా? అలా కాపురం చేయవే అది. పోనీ నీ భర్త ప్రయోజకుడుకానా నీ వుద్దేశ్యం? అలా ఎప్పుడూ అతనిపట్ల చులకనభావం చూపకూడదమ్మా, నీ భర్త చదువుకున్నవాడు. అతగాడు వ్రాతలలో కాలక్షేపంచేయడం ఎవరికీ యిష్టం లేకపోయినా తన కత్యంతప్రియమైన కార్యం అదే అని కృషిచేసి ప్రభుత్వ బహుమతి పొందాడమ్మా! వెయ్యి రూపాయలు! ఈ ఉదయమే నాకు తెల్సింది. ఈ విషయం విన్న మనకే ఇంత సంతోషం కల్గుతూందే అతనికి తెలిస్తే ఎంతగా ఆనందించేవాడో తన జీవితమే సార్ధకమైందని భావించడూ? ఎంత ప్రయోజకుడవుతాడో ముందు ముందు నీకే తెలుస్తుందమ్మా!"

పార్వతి మనసు మనసులోలేదు. ముఖ్యంగా తన మామగారి పరిస్థితి గురించి తల్చుకున్న కొలదీ విచారం కట్టలు త్రెంచుకు వస్తూంది. తన భర్తను అయోమయపరిస్థితులలో యిరికించి రావడం మరీ క్రుంగదీసింది. తనలో ఎన్నో మార్పులు వచ్చినా తండ్రికి తెలియజేయలేక పోతూంది.

ఇంతలో ప్రక్కింటినుంచి వస్తూన్న కొడుకు గుమ్మంలో నిల్చున్న తండ్రిని గుర్తించి "నాన్నా! నాన్నా!" కాళ్ళల్లో దూరి సంతోషంకొద్దీ కేరింతలు కొట్టాడు,

మామగారి మాటలు వీనులకు విందుచేయగా ఏవేవో లోకాలలో విహరిస్తూన్న రఘునాధం కొడుకు మూలంగా ఈ లోకంలో పడ్డాడు. కొడుకుని మనసుతీరా ఎత్తుకున్నాడో లేదో లోపల్నుంచి తండ్రీ కూతుళ్లకూడా వచ్చారు.

"ఏం బాబూ! అంతా కులాసాయేనా?" మామగారి కుశల ప్రశ్న.

తండ్రి పరిస్థితీ, యింటి పరిస్థితీ వివరించి తను పార్వతిని తీసుకువెళ్ళడానికి వచ్చినట్టు తెలియజెప్పాడు రఘునాధం.

మామగారి ముఖ కవళికలలో ఆతృతా, భయమూ గోచరించగానే "మరేం భయపడనక్కర్లేదండీ! పార్వతి వస్తే అన్నీ సర్దుకుంటాయి. మీకు తెలియని దేముంది చెప్పండి." భార్యవైపు దీనంగా చూస్తూ అన్నాడు.

"అమ్మాయ్ విన్నావా?" హెచ్చరించాడు కూతుర్ని.

"పార్వతీ! మా కుటుంబంమీద ఎందుకింత కోపం? ప్రస్తుత పరిస్థితి ఆలోచించు. నాన్నకు నువ్వు వచ్చిన నుంచీ తెలివే లేదు. నీ సహాయంకోసమే వచ్చాను. అమ్మా, నాన్నలకు నారాక తెలీనే తెలియదు."

విచారంలో అశ్రువులు కారాయి.

పార్వతిలో ఒక్కసారిగా జాలీ, దయా, భక్తీ, సానుభూతీ విజృంభించాయి. తన కృతజ్ఞతకు ప్రాయశ్చిత్తం వుంటుందనే భావించింది. "మామగారెంత వుదార స్వభావులు! అతని కతనే సాటి. నన్నే కోరి చేసుకున్నారే! సంబంధాలు దొరకవనా నన్ను చేసుకున్నది? కాదే...తగిన సమయంలో, ఏ అడ్డంకులూ కల్పించక చేసుకున్నందుకా ఇలా నేను ప్రవర్తించడం? అతని ఋణం నేనెలా తీర్చుకోగల్ను? వెంటనే వెళ్ళి దైవసమానులైన మామయ్యను రక్షించుకుంటాను." తన నిర్ణయాన్ని తెలియజేసింది పార్వతి. రఘునాధం ఆనందానికి అవధులు లేకపోయినా తండ్రి పరిస్థితి తల్చుకుని "మామయ్యా! నేను ముందు వెళ్ళాలి" అని నడక సాగించబోయాడు.

సర్వమూ గ్రహించగల్గిన మామగారు కొంత పైకం యిస్తూ "బాబూ! అవుసరానికి పనికివస్తుంది. పట్టుకు వెళ్లు. మేం యిప్పుడే బయల్దేరి వస్తాం." అని సాగనంపాడు.

రఘునాధం రాకకోసరం కళ్ళు కాయలు కాచేలా వీధిలో నిల్చుని ఎదురు చూసింది తల్లి. నాల్గు రోజులయి భర్త మంచం దగ్గర్నుంచి కదల్లేదు. ఇప్పుడే వీధిలో ఆతృతకొద్దీ అడుగు పెట్టింది. దారిన పోయేవారిని ఆచూకీకోసరం అడిగింది. ప్రయోజనం లేకపోగా ఎన్నో చెడు తలంపులు కల్గాయి. తన కొడుకు అలాంటి అఘాయిత్యాలకు దారి తీయడనే దృఢనమ్మకం ఆ ఆలోచనలను వెనక్కు నెట్టివేసింది. ఇంతవరకూ నానాన్న డబ్బుకోసం ప్రతి గుమ్మమూ ఎక్కి దిగుతున్నాడు గాబోలు! ఎటువంటి హీనస్థితి కల్గింది. ఉన్నన్నాళ్ళూ నల్గురికీ పెట్టిన నా కొడుకా నల్గురి చేతులూ కాళ్ళూ పట్టడం? ఓ భగవాన్! ఇటువంటి కష్టాలు

శత్రువుకైనా కల్పించకు బాబూ." తనలో తనే ఎన్నో విధాల పరితపించింది.

ఈ సమయంలో కోడలంటే ఎంత ధైర్యం. అందు కూడా నోచుకోలేక పోయింది ఆ అత్త.

భర్త మూలుగు విన్పించగానే లోనికి వెళ్ళింది. భర్తకు తెలివి వచ్చే చిహ్నాలు పొడసూపినా వెను వెంటనే పటాపంచలయాయి. మందు లేదు. ఆహారం లేదు. నోట్లో ఏదైనా పోస్తేగా చైతన్యం కలిగేది.

అనుకోకుండా రఘునాధం తండ్రి మంచం దగ్గర ప్రత్యక్షమయాడు. తల్లికి వేయేనుగుల బలం వచ్చింది.

"మందు తెచ్చావా నాయనా?" రాగానే ఆతృతకొద్దీ అడిగింది.

"తెచ్చానమ్మా! మంచి మందే తెచ్చానమ్మా!" వస్తూ వైద్యుని కీయవలసినది యిచ్చి తెచ్చిన మందు నూరి త్రాగించాడు.

"అమ్మా! ఇంకా మంచి మందు తెస్తారమ్మా! దాంతో నాన్నగారు మామూలు మనిషవుతారు. మరేం భయం లేదమ్మా."

"ఎవర్రా తెచ్చేది? వైద్యుడేనా? ఎలా తెస్తాడురా? ఇయ్యవలసినది ఇయ్యాకపోతే?" ప్రశ్నలవర్షం కురిపించింది అయోమయంలో కొట్టుకుంటూ.

"వైద్యుడు కాదమ్మా....కోడలు వస్తూందమ్మా".

"కోడలా? పార్వతా? రావడమా? తెలివిగానేమాట్లాడుతున్నావా?

"అవునమ్మా! ఇప్పుడే వస్తాదు" అని కధంతా విశద పరచాడు.

"అయ్యో నాయనా! ఎంత పని చేశావురా! విచారం వెలిబుచ్చి "నా కోడలు యోగ్యమైందిరా!" అని సంతోషం కొద్దీ మనసులోని మాటను తెలియపర్చింది.

ఆ సమయంలోనే వీధిలో బండి ఆగిన చప్పుడైంది. తండ్రీ, కూతురూ, మనుమడూ లోపలికి వచ్చారు. రఘునాధం తల్లి ఆశ్చర్యానికి అంతులేకపోయింది. ఏది మాట్లాడానికీ పాలుపోలేదు.

"దాహం...దాహం...." హీన స్వరంలో మామగారు గొణిగారు. వెంటనే పార్వతి ప్రక్కనున్న వేన్నీళ్ల పొయ్యబోయింది. మామగారు కళ్లు తెరిచారు. మసక మసగ్గా కన్పించింది. ఎవరో పోల్చుకోలేక "ఎవరూ?" లేని కంఠం తెచ్చుకుని అన్నారు.

"నేను..మీ కోడల్ని" నీళ్ళు పోసింది.

"పా...ర్వ...తా... చంటివాడేడీ?" తాపీగా అన్నారు.

"ఇదుగో" దగ్గరగా చేర్చింది కొడుకును.

అంతే అందరి భయమూ పటాపంచలైంది.

"ఆహారంలేని నీరస మేనోయ్. ముఖ్యంగా నీ గురించే" రఘునాధం మామగారన్నారు.

"బెంగ పెట్టుకున్నా రన్నయ్యా. అదే యింత వరకూ తెచ్చింది. ఇక ముందెలా గడుస్తుందో!" అనుమానంతో ఏ ఆధరవూ లేనట్టూ, అది కల్పించుకోవడం కొడుకు చేతులలో వున్నట్టూ స్ఫురించేలా అంది.

రఘునాధం చిన్నబుచ్చుకున్నాడు. తనకోసమేగా తండ్రి వ్యధ. ఉద్యోగ ప్రయత్నం చేయాలన్న నిశ్చయానికి అప్పుడే వచ్చాడు.

"నీ కొడుకు ప్రయోజకుడే నమ్మా! వెయ్యి రూపాయిల బహుమతి నీ కొడుక్కే వచ్చింది."

"ఆ! బహుమతా? నా కొడుక్కా?" ఆశ్చర్యం వెలువరించి "అవును నా కొడుకు గొప్పవాడే....వాడి సంగతి తెలీకనే యిలా యితను మంచం పట్టారు." సంతోషంతో అని మనసులోనే కొడుకు అభివృద్ధిని కోరుకుంది.

ఇప్పటిగ్గాని అందరిలోనూ తలెత్తలేక పోయాడు రఘునాధం.

"పార్వతీ! ఇక యెక్కడికీ పారిపోవుగా?" చిరునవ్వు చిందిస్తూ అన్నాడు.

"ఎక్కడకు వెళతానండీ! స్త్రీకి భర్తేగా సర్వస్వమూనూ" నిండు హృదయంతో అంది.

మంచంమీద పడుకున్నా, ఈ మాటలన్నీ అస్పష్టంగా వింటూన్న సమాధానం చెప్పలేక తృప్తిగా గాలి పీల్చుకుని మరికొంచెం దాహం పుచ్చుకున్నారు రఘునాధం తండ్రి.

# "సహకారంబై సహ"

## శ్రీ పు. స. ప్రసాద్

సహకారం నాల్గుపాదాల నడుస్తున్న సువర్ణయుగమిది. సహకారం గురించి ప్రచారం జోరుగా సాగుతున్న ఈ రోజుల్లో దాన్ని ఆచరణలో పెట్టాలని తీర్మానానికి వచ్చారు, ఏకగ్రీవంగా 'మంజుల నివాస' వాసులు! మంజుల నివాసం హైద్రాబాదులోని నాంపల్లిలో ఓ ముచ్చటైన మూడంతస్తుల మేడ! రమారమి రెండువందల పైచిలుకు జనసంఖ్య! నలభై కుటుంబాల వారికి నిలువ నీడ కల్పిస్తున్న మేడ అది.

ముఖ్యంగా మూడో నెంబరు వాటాలో నివసించే పరమేశం గారిదే ఈ విషయంలో గట్టిపట్టు అని చెపొచ్చు. వారు పందొమ్మిదివందల నలభయి రెండులో హైద్రాబాదు కాలేజీలో చదివే రోజుల్లో రెండే రెండు రోజులు శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించారు.

అప్పుడు జరిగిన స్వాతంత్రోద్యమంలో వన్ను అరెస్టు చేసి జైలుకి పంపించారు. నేనూ ఒక రాజకీయ బాధితుణ్ణో అని నెత్తిన నోరుపెట్టుకుని స్వంతఖర్చుతో ఏర్పాటుచేసిన మైకుముందు మూడున్నర గంటలు వుపన్యాసం చేయగల సమర్థులు.

అయితే వారి అపోనెంట్లు ఆ రెండు రోజులు ఏదో "డబుల్ రైడింగ్" కేసు మూలాన్ని జైల్లో వున్నారని ప్రచారం ప్రారంభించారు.

నిజానిజాలు నిజాం ప్రభుత్వ (మాజీ) రికార్డుల కెరుక.

రెండు మూడుసార్లు నగరపాలక సంఘం సభ్యత్వానికి, తడవకోపార్టీ తరఫున నిలబడి డిపాజిట్లు కోల్పోయారు పరమేశంగారు. రాజకీయ బాధితుణ్ణని దబాయించి, (ఏదో కొంత చెయ్యి తడిచేసి) ఐదెకరాల పొలం సంపాయించిన మహామహులు.

ఇక నాలుగోవాటాలోని బ్యేంకు మేనేజరు ప్రభాకర్ గారి విషయం! రెండు మూడుసార్లు బేంకులో జరిగిన చిల్లర సంతాప సభలకు అధ్యక్షత వహించారు!

ఆరో నెంబరు వాటానివాసులు శ్రీ కరుణాకరం గారు, "కరుణ" అనే కలంపేరుతో కథలు, గేయాలూ వ్రాయటం కద్దు!

"కరుణ" అనే కలంపేరుతో కథలు, గేయాలూ వ్రాయటం కద్దు!

తొమ్మిదోవాటాలోని, నిత్యానందంగారు గీత గోవిందం గ్రాహ్యం చేసికొన్నవారు అనర్గళంగా ఆరు గంటలు "గీత" మీద వుపన్యసించగలరు! బహుశా ఆయన "గీత" కూడా బాగుంటే ఏ అమెరికావో వెళ్ళివచ్చేవారు! నిత్య కాషాయాంబరధారి!

పరమేశంగారి అధ్యక్షతను పైవారంతా, తక్కిన కుటుంబాల్లోని పెద్దమనుష్యులను పిల్చి సమావేశమయ్యారు!

ప్రభాకర్ గారు కోశాధికారిగా, కరుణాకరంగారు నిత్యానందంగారు, ఇరవయ్యోవాటాలోని ముత్తుసెట్టి గారూ, ఆహ్వాన సంఘ సభ్యులుగా, పరమేశంగారధ్యక్షులుగా "సహకార సప్తాహోత్సవాల" కమిటీ తయారైంది!

ఇహ తీర్మానాలలో మొదటిది: "సహకార సప్తాహం" అని ఓ వారంరోజులపాటు వుత్సవాలు జరుపుకోవడం!

రెండవది: ఉత్సవాలలో కవితాగోష్ఠులు, నాటికలు, నృత్యాలూ ఏర్పాటు చేయడం!

మూడవది: ఆఖరి రోజున ఓ గ్రూఫ్ ఫోటో తీయించుకోవడం!

నాల్గవది: ఖర్చుల నిమిత్తం మేడలోని వారందరి దగ్గరా చందాలు వసూలు చేయడం!

ఇలా సూత్రావళి నిర్ణయింపబడి సమావేశం సమాప్తమయింది.

మేడలోని ప్రతి మగమనిషీ తలకోరూపాయి, స్త్రీలు అర్ధరూపాయీ, పిన్నలు పావలా విరాళాలిచ్చారు. బొత్తిగా పాలబుగ్గల పసిపాపలకు దీన్నుంచి మినహాయింపు లభించింది! అయితే ఎవరి తల్లుల వడిలోవారు నిలకడగా వుండే షరతుమీద వారుకూడా గ్రూఫ్‌ఫోటోలో పాల్గొనవచ్చు!

అనుకున్న ప్రకారం ఓ సుముహూర్తాన "సహకార సప్తాహోత్సవాలు" ప్రారంభమయినయ్! మొదటిరోజు నిత్యానందంగారధ్యక్షులు! మేడలోని కోకిలకంఠులిద్దరు ప్రార్థన చేశారు! తర్వాత అధ్యక్షుల ప్రారంభోపన్యాసం జరిగింది! చాలామంది వక్తలు ఏదో వాగేరు! కరుణాకరంగారి "సహకారం" గేయపఠనంతో ఆనాటి సభ సమాప్తమయింది!

రెండోరోజు ప్రభాకర్ గారధ్యక్షులు. ఆనాడు మేడ ఆవరణలో ఓచిన్న వుపవనం సృష్టించి తద్వారా వనమహోత్సవాన్ని ఉద్ధరించాలని బుద్ధిపుట్టింది! మంజుల నివాసులకు యెవరికీ తోచిన మొక్కలు వారు పబ్లిక్ గార్డెన్సులోనుంచి, యితరుల పెరళ్ళలోంచి, ఆఫీసు నైట్ వాచర్ కాళ్ళుగప్పి సంగ్రహించి తెచ్చారు!

పరమేశంగారు లాంఛనంగా ఓ మామిడిమొక్కను నాటి ఆనాటి వనమహోత్సవం ప్రారంభించారు!

మూడోనాడు "సహకారం" మీద వుపన్యాసాలు ఏర్పాటయినయ్! దేశనాయకులు సహకారంమీద చేసిన వుపన్యాసాలకోసం పాత పత్రికలన్నీ గాలింపబడ్డయ్!

వాటి సారాంశం ప్రతివారు సారాలా బట్టీపట్టి కాచి వడబోసి, వేడివేడిగా తాగేశారు ముందస్తుగానే! కాని వేదిక మీదకి వచ్చేటప్పటికి కాళ్ళు వణికి, మాటలు తడబడి, తూలిపడబోయి, బట్టీ పట్టింది బయటికి కక్కలేక గుటక వేసేశారు!

కాని నిత్యానందంగారో రెండు గంటలూ, ప్రభాకర్ గారో గంటన్నరా సుదీర్ఘోపన్యాసం చేసేసి ఆపైన చెరో డ్రింకూ గడగడా తాగేశారు కడుపులో గడబిడ తగ్గడానికి!

నాల్గోవాడు యువక బృందంలోని "మేటినటు"లంతా "సహకారం" అనే నాటిక ప్రదర్శించి శభాషనిపించుకున్నారు. బాలికలు నృత్య ప్రదర్శన లిచ్చారు!

ఐదోనాడూ, ఆరోనాడూ సహకార కార్యాచరణం జరిగింది! అంటే "సహకారా"న్ని మాటల్లోనే గాక చేతల్లోగూడా ప్రదర్శించాలని వారి భావం!

ఒకర్నొకరు మన్నన చేసికోవడం, మీరు గొప్పవారంటే మీరు గొప్పవారనుకోనడం, స్నేహభావంతో కౌగలించుకోవడం, భుజాలు తట్టుకోవడం ఎక్స్ట్రా ప్రారంభించారు!

మచ్చు తునకలు కొన్ని—

ఒకింటి ఆడపడుచు మరో యిల్లాలి నల్లని పిల్లాణ్ణి చూసి "ఎంత అందంగా వున్నాడమ్మా! అచ్చు బంగారచ్చమ్మా" అంది! ఓ పొడుంబుర్ర అమ్మాయిని చూసి మరో ఇంటావిడ "చంద్రబింబం" లాటి ముఖమమ్మా" అని మెచ్చుకొని మెటికలు విరచింది!

ఈ సందర్భంలోనే ఓ అసందర్భం జరిగింది. మేడ మీద పద్నాలుగో నెంబరు గదిలో వుండే కాలేజీ కుర్రాడు పందొమ్మిదిలో వుండే కాలేజీ లేడీని చూసి "మీరు చాలా బాగున్నారు" అని కళ్ళుమూసి చేతులు తిప్పాడు! మరో హాప్పుడయితే ఛడావులో చెంప కుద్దో చేసే ఆ అమ్మాయి నవ్వేసి వూరుకొంది!

ఎదుటివాళ్ళ తల్లుల్ని తన తల్లిగా, యెదుటవాళ్ళ సోదరుల్ని తన సోదరులుగా, ఎదుటివారి భార్యల్ని తన భార్యలుగా (హతోస్మి) యెంచే ఓ రసరాట్టు, ఓ యింటావిడపై చూపుల తూపులు విసిరాడు! ఆవిడ కన్నుల్లో కెంపులు వెలిగినా, పెదిమలు చిలిపి చిరునవ్వు నవ్వేశాయి.

ఇంత చక్కగా సాగాయి సహకార వారంలోని ఆర్రోజులూ!

ఒకవేళ శ్రీనెహ్రూగారే "మంజుల నివాసానికి" సర్ప్రైజు విజిట్టుకివస్తే వెంటనే "ఆదర్శ హర్మ్యం"గా పరిగణించి వుండేవారు!

ఇక ముఖ్యాతిముఖ్యమైనరోజు ఏడోరోజు వచ్చింది. ఏడు సంఖ్య మంచిది కాదంటారు మనవాళ్ళు! ఈలాటి అప నమ్మకాలలో నమ్మకంలేని నాకుకూడా, ఆ సంఘటన విన్నాక 'ఏడు మాచెడ్డ అంకెస్మీ' అనిపించింది! ఆ సంగతి నివేదిస్తా! మీరుకూడా మనసులో పెట్టుకోని ఏడు 'మాచెడ్డంకె' అన్నది ఒఠి సూపర్‌స్టిషన్ అనే వుద్దేశం గానీ వుంటే వెంటనే విడాకు లిచ్చెయ్యండి!

ఇంతకి ఏడోనాడు గ్రూఫ్ ఫొటోకి ఏర్పాట్లు జరిగాయి. మొదట అతి చవుకగా ఫొటో తీయించుకునే లక్ష్యంతో ఔండర్లు పిలుద్దామనుకున్నారు గాని, టైము చాలక వెంటనే 'ద గ్రేట్ ఫొటో స్టుడియో'కి అర్డరిచ్చేశారు.

ఫొటోగ్రాఫరు ముక్కాలిస్టాండుమీద కెమేరా బిగిస్తున్నాడు. ఎదురుగుండా ఇరవై కుర్చీలు వేశారు! ఒక్కొక్కరే కుటుంబ సమేతంగా వస్తున్నారు.

ప్రక్కింటివాళ్ళ ఎరువు నగలు పెట్టుకున్నదో ఇల్లాలు, ఇంకోరి షిపాన్ చీర కట్టేసిందొక కల(హ)భాషిణి కాలేజీ కుర్రాడు యెవరిదో ట్వీడ్ పాంటూ, డెక్రాన్ శ్లాకూ, లాండ్రీలో అద్దెకి తెచ్చుకున్నాడు! నిత్యానందంగారు కొంచెం మొగలిఅత్తరుకి కక్కుర్తిపడ్డాడు! మీసాలకు గడ్డాలకు సంపెంగ నూనె బనాయించాడు! రంగురంగుల చీరెలు, టెక్నికలర్డ్ ట్వీడ్ సూట్లూ, సెంట్ల ఘుమఘుమలూ ఆ ఆవరణంతా ఆవరించాయి.

తీరా కుర్చీల దగ్గరగా వచ్చిచూస్తే ఏముంది! లెక్కకి పది రెళ్ళిరవయ్యే వున్నయ్. అంతకంటె ఒక్కటి కూడా ససేమిరా వెయ్యడానికి వీలులేదన్నాడు!

కాని వున్న పెద్ద మనుష్యులు కేవలం మొగాళ్ళని లెక్కేసినా అరవైమంది వున్నారాయె. కాని సమాన హక్కులకోసం సమరం సాగించే స్త్రీ సభ్యురాండ్రో! అందులోనూ ఏడో నెంబరు యింట్లోని కమలమ్మగారు లేడీస్ క్లబ్‌కి ఎక్స్-సెక్రటరీ కూడాను! ఆ యింట్లో పద్నాలుగులో వుండే రజని రేడియో టాగులు టాగుదుందట! మరి ఆవిడకి మాత్రం ఆసనాధిపత్యం వుండద్దూ! పరమేశంగారి భార్య అథవా అరడజనుసార్లు లేడీస్ సీటుకి పోటీచేసి ఓడిపోయింది! మరి ఆమె విషయం?

వివాదం ఎంతకీ తెగలేదు. ప్రతివారితోనూ! ఈర్ష్య నేస్తం కట్టింది. పైకి ఏమీ అనకపోయినా లోపల కావేషాలు జాస్తీ అయినయ్. కడకు ధైర్యంచేసి కరుణాకరం గారోకుర్చీలో కూర్చోబోయారు! పదిహేడో నెంబరు ఇంటాయన మేడిన్ తాలింఖానా! అంచేత కొంచెం ఆజానుబాహువు! జబర్దస్తీకూడా జాస్తీయే. కరుణాకరంగార్ని జబ్బట్టుకు నుంచోబెట్టాడు! వెనక్కి వెళ్ళమని సంజ్ఞచేస్తూ.

"ఏం! నేను కవిని. నాకామాత్రం గౌరవం చూపించక్కర్లే?" అడిగాడు కరుణాకరంగారు.

"ఆ! మా గొప్ప కవివి? ఎందులో పడ్డాయయ్యా మీ కథలూ గేయాలూ? వొట్టి నేతిజిడ్డువాటం" అంటూ నే

మిస్టర్ జబర్దస్తీ కరుణాకరంగార్ని తోసేసి ఆకుర్చీ ఆక్రమించేడు.

చేసేదేమీ లేక (అర్భకుడు కాబట్టి) కరుణాకరంగారు వుడాయించారు.

కాని ఇరవయ్యో వాటాలో ఆయన, ఆటల్లో ఛాంపియన్! పెద్ద క్రికెటూర్. కుస్తీలో వస్తాదు! "భారతశ్రీ" పోటీలలో పాల్గొనబోతున్నాడు ఆయనగారు. "మిస్టర్ జబర్దస్తీ"ని "ఓ చూపు" చూశాడు.

వారిద్దరూ అమెరికను, స్పెయిను మోటపద్ధతిలో, ఫ్రీస్టయిల్సులో మల్లయుద్ధం సాగిస్తున్నారు.

"సహకారం" ప్రక్కకి తప్పుకుంది సిగ్గుపడి. లోపల్లోపల మండిపోతున్నారు ఒక్కొక్కరు. ఒకరిమీదొకరు పళ్ళు నూరేస్తున్నారు. కోపం కుతకుత వుడికి చివరికి అణిగి పడి వుండలేక పైకిపొంగింది.

ఫలితంగా చిన్న గలాటా, తర్వాత దొమ్మి, చిన్న సైజు యుద్ధంగా మారింది. కాలేజీ కుర్రాడు టెన్నిస్ రాకెట్టూ, పరమేశంగారి వెండిపొన్ను చేతికర్రా, అనసూయమ్మ అట్లగరిటా, వెంకమ్మ పొయ్యిలో కొరకంచులూ, యాటంబాంబు, నైట్రోజన్ బాంబులకన్నా తీవ్రమైన మారణాయుధాలుగా పనిజేశాయ్.

పోలీసుల లాఠీప్రయోగం జరిగి ఆ మేడలో 'కర్ఫ్యూ' అమల్లోకి వస్తేనేగాని యుద్ధం సమాప్తం కాలేదు.

ఆ మేడలో నిశ్శబ్దం అధికారంలోకి వచ్చింది.

చివరకి నానా భీభత్సంగా తయారయ్యింది కొంప! వన మహోత్సవమంటూ నాటిన మొక్కలన్నీ విరిచేసి కలదొక్కేశారు. మామిడిమొక్క మోడయింది! విరిగిన కుర్చీలు, చిరిగిన చెప్పులూ, పగిలిన గాజులూ, నలిగిన చీరలూ, పేలికలైన జాకెట్లు, చొక్కాలో చినిగిన పంచెలూ, ఫోటోగ్రాఫరుగారి నల్లబురకా చెల్లాచెదురుగా పడిపోయాయి నేలమీద సహకార సప్తాహానికి అవశేషాలుగా.



# మేనకాని వేదిక

## శ్రీమతి ధవళ రుక్మిణీదేవి

దేవనాథునిచే ప్రేరేపించబడిన దేవకాంతయగు మేనక తన విలాస వికాస సౌకుమార్య లావణ్య ప్రభలచే, సుదీర్ఘ తపోనిష్ఠాగరిష్ఠుడగు విశ్వామిత్రుని నిష్కల్మష నైర్మల్య తపస్సమాధిని భంగపరుప సన్నద్ధురాలై నిజ కోమల కంఠస్వరంబు మేళవించి ఆలపించిన సుమధుర గీతిక—హృదయసీమ నలంకరించిన అనురాగమాలిక.

ఓ.... మునివరా.... మనోహరా
మనవిని వినరా
మగువను కనరా
మనసున గొనరా.... ॥ఓ॥

సుందరనందన దేవవిలాసిని
అందము చిందే అమరనివాసిని ॥ఓ॥

ప్రార్థించి సుమబాల నీమ్రోల మేని
సోలింది మురిపాల మధువన అవని
భావజభావన హృదిలోన వేదన
లోకపావనా లేదారాధన ॥ఓ

అలివేణి నీలవేణి పల్లవపాణి నే
కనజాల మనజాల తపభార మేల ధీర
సుకుమార లతిక పాడింది గీతిక
వలదింక తపమింక వేగరార యేలిక ॥ఓ॥

వగలు బాపగ
వలపు రేపగ
చింత బాయగ
కౌగిలీయగ
ఆలకించవోయీ..ఆదరించవోయీ..ఆలసించకోయీ

బాల వినోదం!

# దయ-నిర్దయ

## "శ్రీ కౌశిక్"

కృపగల్గు మనసులే క్రీడావనాలు
దయచిల్కు తలపు లందలి చెట్ల వ్రేళ్ళు,
కరుణోక్తులే వాని కమ్మని పూలు,
తరుగని నెనరు చేతలె వాని పండ్లు.

ప్రసరించు ప్రేమ సూర్య ప్రకాశంబు,
ఉత్సాహ మది యిచ్చు ఎల్లప్రాణులకు,
కడుపగ గాఢాంధకారమా, అదియె
జగడాలు చెలరేపు. జగతినే మాపు.

(హురేస్ మాన్ గీతాలకు అనువాదం)

# ఆంధ్ర మహిళాసభ, బర్కత్పురం - హైదరాబాదు

పై సభ 26-1-1961 వ తారీఖున వసతి గృహా వరణంలో 9-30 (ఉదయం) గంటలకు ప్రజా ప్రభుత్వ దినోత్సవాన్ని మహా వైభవంతో జరిపింది.

శ్రీమతి శేషు శ్రీరంగం, యం. యే. గారు జాతీయ పతాకాన్ని ఆవిష్కరించి, ఆనాటి సభకు అగ్రాసనాధిపత్యం వహించారు.

శ్రీమతి కందా మాణిక్యాంబగారు, శ్రీమతి చంద్రమతీదేవిగారు, శ్రీమతి లీలాగౌరి బాజేగారు, శ్రీమతి లక్ష్మీభాగ్యనగరుగారు మున్నగు మహిళామతల్లులు ఆనాటి యుత్సవంలో పాల్గొన్నారు.

ప్రేక్షకులు, తర్ఫీతునొందుచున్నవారు, ఉద్యోగినులు మున్నగువారు ఆనాడు ఉదయం సూత్రయజ్ఞం జరిపారు. సభలో శ్రీమతి సుగుణమణి, సభాగ్రాసనాధిపత్యం వహించిన శ్రీమతి శేషు శ్రీరంగంగారిని గూర్చి పరిచయ వాక్యాలు పలికారు.

శ్రీమతి శేషు శ్రీరంగంగారు తమ ప్రారంభోపన్యాసంలో, మహిళా సంస్థలో తర్ఫీతుపొందుతున్న బాలికామణులకు "ఎంతటి కార్యాన్నైనా (అతి స్వల్పంగానీ, ఘనంగానీ) మనస్ఫూర్తిగాను, శ్రద్ధగాను చేయాల్ననీ, ప్రతి వ్యక్తి తన శీలం సద్గుణం, ఉత్తమ ప్రవర్తన కలిగిఉండాలి. శ్రీ గాంధిజీ, సుభాష్‌చంద్రబోసు, జవహరులాలు నెహ్రూ మొదలగు ప్రముఖుల వల్లనే మనదేశ ప్రశస్తి విదేశీయులకు తెలియవచ్చినది. మన జాతికి భావికాలంలో నాయకులు కాదగిన యౌవనులు తమ పూర్వనాయకుల ప్రఖ్యాతనాయకుల యొక్క ఉత్కృష్టగుణములను సర్వదా జ్ఞప్తియందుంచుకొనదగును. కేవలం ఉపన్యాసాలవల్లనూ బాహ్యానటనలవల్లనూ, ప్రజానాయకత్వం సిద్ధించదు. మంచి అలవాట్లకు పనుపడటం నిష్కపటంగా నడుచుకొనటం న్యాయబుద్ధికలిగిఉండటం ఈలాటివి మానవుడిలో సత్స్వభావాన్ని రేకెత్తించి, అతడికి ఉన్నత స్థితి సిద్ధింపజేస్తుంది. ఎవ్వడుగాని, పట్టభద్రతలను, యోగ్యతాపత్రాలను బజార్లలో కొనగలడు. కాని, ప్రపంచంలో ఎక్కడను, నిష్కళంక ప్రవర్తనను, నిష్పక్షపాతాన్ని, నిర్దుష్టస్వభావాన్ని ఎవ్వడు గాకొనజాలడు.

ఈ మానవజగత్తులో ఏ ప్రదేశంలోనైనాసరే, తన జీవిత పరమార్థమయిన మంచిగుణాల్ని పెంపొందించుకోవటం అత్యంత ప్రధానం. పరస్పరం మానవులు అసూయతతో చరించిన హేతువువల్లనే, శతాబ్దముల తరబడి మన భారతదేశం అన్యులకు దాస్యంచేయవలసి వచ్చింది. ప్రకృతం స్వాతంత్ర్యంపొందిన మన భారతదేశ జాతీయత మరలమునుపటి మహోన్నత స్థితికి రావాల్నంటే, ప్రకృతం మనలో శాశ్వతంగా ఐక్యమత్యంతో అందరూ మెలగడం చాలా అవసరం. మన భారతదేశపు ప్రాచీన చరిత్ర పునరావృత్తము అయ్యేటట్లు ఇంకను కష్టాలపాల్పరుపకుండా నిరోధించటం అనేది మనకందరికికూడా ముఖ్యమయిన సమస్యగా భావించాలి. ఇప్పటి మన ప్రజానీకం యొక్క భుజస్కంధాలమీద ఆ భారం పడివుందని గ్రహించాలి. అనేకరంగాలలో ఇక్కడ తర్ఫీతుపొందు యువతులలో ముఖ్యంగా ఐకమత్యంలోని పెంపొందించటానికి అందరూ ప్రయత్నించటంలోనే వారి మహోద్యమ విజయం ఉన్నదని విశ్వసించాలి. ఈ నాలుగు మాటలు అభ్యుదయ మార్గంలో ఉన్న ఇక్కడి బాలికలకు చెప్పే అవకాశాన్ని నాకు కలిగించిన ఇక్కడి సంఘ సంక్షేమాధికార్లకందరికి నా కృతజ్ఞతాభివందనాలు చెల్లిస్తున్నాను."

శ్రీమతి చంద్రమతీదేవిగారు ఆనాటి సభాధ్యక్షురాలుగాను, శ్రీమతి శేషు శ్రీరంగంగారిచ్చిన అమూల్యమయిన సలహాలను తరబీతులో ఉన్న బాలికలు మరువకుండా, సాధ్యమయినవాటిని ఆచ్చరణలో పెట్టటం ప్రధాన కర్తవ్యంగా భావించాలని చెప్పారు. ఆనాటి వక్త అయిన శ్రీరంగంగారిచ్చిన సలహాలను శ్రేయనింగు పొందేవారు ఎల్లప్పుడు జ్ఞప్తిలో ఉంచుకోవటం అవసరమనటాన్ని నిరూపించే భోజమహారాజు కాలంనాటి కథను ఒకదాని వినిపించారు.

ఆంధ్రమహిళా సభా సంయుక్త కార్యదర్శిని అయిన శ్రీమతి కే. సుగుణమణిగారు, తర్ఫీతునొందు కన్యకలకు: "ఆనాటి యుపన్యాసములలోని ముఖ్యాంశాలు జీవితాంతంవరకూ జ్ఞాపకం ఉంచుకొనదగినవని ప్రబోధిస్తూ, వేడుకొన్న వెంటనే, ఆనాటి కార్యక్రమాలకు అగ్రాసనాధిపత్యం వహించటానికి వెంటనే సమ్మతించిన శ్రీమతి శేషు శ్రీరంగంగారి సౌహార్ద్రమునకు అనేక ధన్యవాదాలర్పించుడంతో సభ ముగిస్తూ "జనగణ మన" జాతీయ గీతం అందరూ పాడారు.

ప్రేక్షకులకు పిల్లలకు స్వల్పాహారాలు, పండ్లు పంచిపెట్టబడ్డాయి.

కే. సుగుణమణి,
సంయుక్తకార్యదర్శిని, బర్కత్‌పూరు

# వార్తావళి

## కాంగో

అంతఃకలహాల రాపిడి నానాటికి పెచ్చు పెరగటంతో కాంగోస్థితి మరీ విషమించి శ్రుతిమించి రాగాన పడినట్లయింది. దీనికంతా కారణం లుముంబా పక్షాన్ని నిర్మూలం చేయ సంకల్పించిన ప్రతిపక్ష వర్గానికి బెల్జియం ఎప్పటికప్పుడు యిస్తూవుండిన ప్రోత్సాహం; నానాజాతి సమితి అలక్ష్యభావం—అనటాని కేమాత్రం సందేహం లేదు. ఏమాత్రమయినా పాట్రిస్ లుముంబా పక్ష పరిస్థితులను గమనించటంలో కొంచెం శ్రద్ధవహించి, యు. యన్. పనిచేసి వుంటే యిలాటి దుర్గతి కాంగోలో సంభవించేదానికి ఆస్కారం వుండేదికాదు.

లుముంబా ప్రతిపక్షవర్గం ఎక్కువగా వుండే ప్రదేశాలలోని చెరసాలలలో నిర్బంధింపబడ్డ కాంగో మాజీ ప్రధాని దారుణ హత్యకు (తుదకు) గురికావటం మాత్రం ప్రపంచంలోని యేజాతిగాని హర్షించటంలేదు. మీదు మిక్కిలి గర్హిస్తున్నది. లియోపోల్డు విల్లా ప్రభుత్వ ప్రకటననుబట్టి అతడు తన సహాయకులైన మరి యిద్దరు మంత్రులతో జైలునుండి తప్పించుకొని వచ్చి ఒక కుగ్రామంలోని అల్పసంఖ్యాక గ్రామీణులచే చంపబడ్డాడనీ అయితే తాతూ గ్రామం పేరుగాని, హంతకుల పేర్లనుగాని చెప్పమనటంవల్ల ఈ హత్యాకాండంలో కసవాబు ప్రభుత్వానికి కొంతవరకు సంబంధం వుండితీరాల్నని కొన్ని దేశాలు ఆ ప్రభుత్వ వర్గాన్ని శంకించటంలో అర్థమున్నది. దక్షిణ కసైప్రాంతాలలో మిక్కుటంగా వున్న బెల్జియం సైన్యాధికారి వారిని కాల్చాడని మరొక వార్త వినవస్తూంది. ఇంతకూ లుముంబా త్రయం ఎక్కడ ఎవరిచే ఎప్పుడు కాల్చబడ్డారనేది మాత్రం అంతు తెలియక పోవడం శోచ్యం.

లుముంబాకు వ్యతిరేక రాజకీయ నాయకుల నందర్భి—కటంగా అధ్యక్షుడు షోంబే, కసవాబూ—మున్నగు వారినెల్ల తక్షణం అరెస్టు చేయాల్నని కొన్ని రాజ్యాంగాలు సలహా యిచ్చినాయి.

పండిత నెహ్రూగారుకూడ దీని కూపీ తీయాల్ననిన్ని వెంటనే విషయాలు సేకరించాల్ననిన్ని, అలా చేయని పక్షంలో నా నా జా తి ప్రతిష్ఠ దెబ్బ తింటుందనిన్ని స్పష్టంగా చెప్పాడు. దాన్ని అధ్యక్షుడు కెన్నెడికూడా ఆమోదించాడు. అందరికంటె తీవ్రంగా కమ్యూనిస్టు రష్యా ప్రతినిధి నానాజాతీయ సమితిని విమర్శిస్తూ సర్వసాధారణ కార్యదర్శి అయిన శ్రీ హామర్షెల్డు తక్షణమే రాజీనామా యియ్యాలని బల్లగుద్ది చెప్పాడు.

ఇటీవల వార్తలు మరీ భయంకరంగా వున్నాయి. యు. యన్. సెక్రెటరీ ప్రతినిధి అయిన శ్రీ రాజేంద్ర దయాల్ లుముంబా హత్యను విన్న క్షణాననే బెల్జియం సైనికుడు కనిపిస్తే కాల్చివేయమనీ—వెంటనే కటాంగా ప్రభుత్వం లుముంబా కళేబరంతోబాటు తక్కిన రెండు శవాల్నికూడ వాళ్ళ బంధువుల వశం చేయాల్నని ఉత్తర్వులు జారీచేయటమే కాకుండా ఏనాటివార్త లానాడు యు. యన్.కు తెలుపుతున్నాడు. లుముంబాను హత్యచేసిన తరువాత లియోపోల్డు విల్లానుండి వెళ్ళగొట్టబడి బాక్వాంగాకు పంపబడిన లుముంబా అనుచరులలో ఆరుగురు ప్రముఖులను చంపేశారని తెలుస్తున్నది.

ఏమయినా, ప్రకృతం ఈ విషయాన్ని గూర్చి చర్చిస్తూవుండే యు. యన్. సమావేశంలో తగిన చర్య తీసికోవటానికి పూనుకుంటేగాని ఈ కాంగోరాజ్యంలోని కల్లోలాలు అణగారవు.

"మేము ఈ పయివిషయాలు వ్రాసి ముగిస్తుండగా—ఇప్పుడే నానాజాతి సమితి, సర్వరాజ్య ప్రతినిధుల చర్చల ఫలితంగా ఒక నిశ్చయానికి వచ్చిందని తెలిసింది. "కాంగోలో ప్రశాంతి నెలకొల్పి, అంతః కలహాలను అణచేందుకు అవసరమయ్యే విషయాలలో బలప్రయోగాన్నికూడా సమితి కార్యదర్శి చేయటానికి ఏమాత్రం అభ్యంతరం ఉండరాదు" అని సంపూర్ణాంగీకారంతో ఒక తీర్మానం చేసింది. ఇలాంటి తీర్మానానికి ముఖ్యంగా అధ్యక్షుడు కెన్నడీ—శ్రీ పండిత నెహ్రూగార్లు పరస్పరంగా శ్రద్ధ కలిగించుకోవటమే కారణమని ఊహింపబడుతున్నది. ఏది ఎట్లయినా, కొంతవరకిది కాంగో పరిస్థితులను బాగుపరచటానికి దారి చూపగలదని ఆశించవచ్చు. కాంగోలో అలజడి రేపే ఇతర దేశాలవారిని వెళ్ళగొట్టడానికిగూడ సమితికి బలమిస్తుంది.

## న్యూఢిల్లి

భూటాను మహారాజు ఈనెల 8—2—'61 న్యూఢిల్లీకి వచ్చి చైనా—భూటాన్—ఇండియాల సరిహద్దులను గూర్చిన తబిసీళ్ళనుగూర్చి మన ప్రధానితో చర్చించి, కొన్ని నిర్ణయాలు చేసికొన్నాడు. ఆయన 17-2-'61 మన మదరాసు నగరానికిగూడా వచ్చి 19-2-'61న బొంబాయికి వెళ్ళారు.

నేపాలు మంత్రి శ్రీతుల్సిగిరిగారు ఈ నెల మొదటి వారం వచ్చియుండి వెళ్ళారు. రాజా మహేంద్ర గారు మంత్రివర్గాన్ని రద్దుచేసి క్రొత్త మంత్రిసమితి నియమించినా, రగడలు అలాగే కొనసాగుతున్నవి.

నాగాల్యాండులో స్వాతంత్ర్యం నెలకొల్పటానికి సూచనగా 42 సభ్యులతో పిలూ ఓ అనే అతని అధిపత్యం క్రింద తాత్కాలిక ప్రభుత్వం నియమించబడ్డది. కార్య నిర్వాహకవర్గ సభ్యులచే ఈ నెల 18వ తారీఖున అస్సాం గవర్నరుగారు రాజభక్తి ప్రమాణాన్ని చేయించి, తగిన హితబోధతో రాజ్యం వారి హస్తగతం చేశాడు.

15 2-'61న లోక్‌సభలో రైల్వేలకు రాబోవు 1961-'62 వత్సరం ఆదాయవ్యయ పట్టికను—రైల్వే శాఖామంత్రి శ్రీ జగజీవన్‌రాము సమర్పించాడు. దాన్ని అనుసరించి వచ్చేయేట 8.64 కోట్ల రూపాయలు అధికాదాయం కనబడుతున్నది. రైల్వే చార్జీలలో ఏమీ మార్పులేదు. చిన్నచిన్న ఎగుమతి సరకుల చార్జీలు మాత్రం ఇబ్బడి చేయబడింది. అంతకు ముందు దినం (14-2-'61న) భారతదేశాధ్యక్షులు శ్రీ ప్రసాదు గారు లోకరాజ్య సభాసభ్యుల సమావేశంలో సంవత్సరం మొత్తంమీద జరిగిన—జరుగుతున్న ప్రపంచ విషయాల్నుగూర్చి పరామర్శిస్తూ ఉపన్యసించారు.

చైనాభారత సరిహద్దు విషయాలనుగూర్చి విచారించుట కేర్పరచబడిన ప్రభుత్వాధికారవర్గద్వయం, భారత, చైనా, బర్మాదేశాలలో సమావేశమయి—తేల్చిన విషయాల నివేదికలు—లోక సభలో ప్రకటించారు. పరిశీలించినవారికి గజగర్భంలో చైనావాళ్ళ మాయలు, కుతంత్రాలు, పన్నాగాలు, నూతన సృష్టులు—రంగు (కాగితాల) రకాల వైచిత్రాలు తప్ప మరేమీ లేవు. వాని అజగజాంతరం.

## రాష్ట్రాలు

(ఒరిస్సా) కాంగ్రెసులోని విభేదాల అంటు జాడ్యం ఒరిస్సాకుకూడా వ్యాపించింది. కాంగ్రెసు గణతంత్ర మిశ్రమ మంత్రివర్గ ముఖ్యసచివుడు శ్రీహరికృష్ణ మెహతబ్ కూడ రాజీనామా ఇచ్చాడు. ఇప్పటికి—ఆంధ్ర, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్, మైసూరు, కేరళ, పంజాబు మున్నగువాటితోకూడ రాష్ట్రాలన్నీ తమపక్షాన్ని తామే చేసేతధ్వంసం చేసే కాంగ్రెసుకుల అధికార వ్యామోహానికి—శాశ్వత రాజకీయ సంస్థ బలి కావలసి వస్తుందేమోనని ప్రాజ్ఞులూహించకపోరు.

# శ్రీ కృష్ణసిన్హాగారి నిర్యాణం

బీహారు ముఖ్యమంత్రి అయిన శ్రీ కృష్ణసిన్హాగారు 31 జనవరి 1961 నాడు తమ డెబ్భైమూడోయేట పరమపదించారు. భారతదేశపు స్వాతంత్ర్య పోరాటంలో ముందంజవేసిన అగ్రనాయక శ్రేణికి చెందినవారు బీహారులో పలుకుబడిగల ప్రముఖుల్లో శ్రీరాజేంద్ర ప్రసాదుగారు ప్రథములయితే, వీరు అద్వితీయులయిన ద్వితీయులు.

శ్రీ సిన్హాగారు, 1888 సం|| అక్టోబరు 21 తారీఖున జన్మించి, 1915 సం||న న్యాయవాదిగా పట్టభద్రులయ్యారు. జాతిపిత స్వాతంత్ర్య శంఖారావము విని 1921 సం||న న్యాయవాద వృత్తిని త్యజించి రాజకీయ శాంతి సంగ్రామ రంగంలోకి దూకారు. పెక్కుసార్లు కారాగారావాసం చేశారు. వీరు 1946 సం|| నుండి మరణించేంతవరకూ ముఖ్యమంత్రిగా పనిచేశారు. ఏ రాష్ట్రంలోను ఏ నాయకుడూకూడా ఇంతకాలం ఆ పదవిలో లేకపోవటమే, ఆయనయెడల ప్రజావిశ్వాసం ఏపాటిదో తెలియచేస్తుంది. వీరి ఆత్మకు శాంతి చేకూరుగాక !

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఎడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ.

పారిశ్రామిక విద్యాలయము : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము

మహిళా మందిరము : విద్యార్థినులకు వసతి గృహము

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

నర్సింగ్ హోమ్ : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్ —మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణకూడ యివ్వబడు చున్నది.

ఆర్థోపీడిక్ సెంటర్ : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం

ముద్రణాలయము : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును ప్రింటింగు జాబ్ వర్క్సు చేయబడును

నాగేశ్వర శిశువిహార్ : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది.

అర్బన్‌వెల్ఫేరుప్రాజెక్టు : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్‌లోను బీదలకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది.

వనితా బాలవిహార్ : స్త్రీలకు, పిల్లలకు- పార్కు, ఆటస్థలం

రీజియనల్‌హాండీక్రాఫ్ట్సుయిన్స్టిట్యూట్ : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదుబ్రాంచిచే నడుపబడుచున్న చేతిపనుల శిక్షణాలయము

# 'ఆంధ్ర మహిళ'

(ఆంధ్ర మహిళాలోకాభ్యుదయ మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్.

విడి పత్రిక—37 నయాపైసాలు ప్రత్యేక వార్షిక సంచికతో కలిసి
సం॥ చందా - రూ. 6-00.

పంచాయతీ సంస్థలకు. సంక్షేమ సంఘాలకు, పౌరజన గ్రంథాలయాలకు
పాఠశాలా పుస్తక భాండాగారాలకు సగము చందా సం॥ ర౦॥ కి రూ. 3-00 లు.

## పత్రికా విక్రయసంస్థల యేజంట్లకు

1. 'ఆంధ్ర మహిళ' అరెంటికంటె తక్కువ ప్రతులకు ఇచ్చే ఆర్డర్లు గమనింపబడవు.
2. పత్రికకు 1 కి 12 న. పైసాలు కమీషను ఇవ్వబడును. పోస్టేజి మేమేభరింతుము.
3. విక్రయంకాని సంచికలు వాపసు తీసికోబడవు.
4. ప్రతినెల "ఆంధ్ర మహిళ" ఎన్నిప్రతులు కావలెనో సూచిస్తూ. అసలుక్రయంలో కమీషను మొత్తం మినహాయించుకొని, తక్కిన మొత్తంతో వచ్చే ఆర్డర్లు అంగీకరింప బడును.
5. ప్రత్యేక వార్షిక సంచిక ప్రతి 1. కి రూ. 2 లు, అయినా, యేజంట్లకు రూ. 1.50 కే, (అనగా 25. కమీషన్ మినహాయింపుతో) ఇవ్వబడుతుంది.

## ఆంధ్రమహిళ

### ప్రకటన రేట్లు

సామాన్యమైన పుట 1 కి. రూ 60. లు,

అట్టకాగితం 2 వ పుట, 3. వ పుట (ఒకేరంగుతో) రూ 80 లు.

4. వ పుట (ఒకేరంగుతో) రూ 100 లు.

కొయ్య దిమ్మెలుగల బ్లాకులు అంగీకరించ బడును. ప్రకటనలు. బ్లాకులు పత్రిక వెలువడే తారీఖునకు 10 దినములు ముందే మాకు చేరాలి.

మేనేజరు,
ఆంధ్రమహిళ
7 ఎ. రోజరీచర్చిరోడ్డు.
మైలాపూరు—మద్రాసు 4.

Printed at Andhra Mahila Press, 7/A, Rosary Church Road, Published and owned by Andhra Mahila Sabha, Madras. Editor - Secretary, Andhra Mahila Sabha.